# ఛత్రపతి శివాజీ

కృతికర్త

శ్రీ నండూరి రామకృష్ణమాచార్య

ఆంధ్రోపన్యాసకులు : కళాశాల : భీమవరము.




:ప్రచురణ:-

కవితాప్రభాస, భీమవరము

ప్రథమ ప్రదర్శనము

శ్రీ రాజరాజనరేంద్ర పట్టాభిషేక వర్ధంతి. 14—9—46

పశ్చిమ గోదావరీ కాళాశాలా విద్యార్థినాట్యమండలి.

శివాజీ:— శ్రీ ధుమంతరావు లక్ష్మీనారాయణమూర్తి

రామదాసు:— శ్రీ హెచ్చి. రామమోహనాచారి

భారతీతీర్థుడు:— శ్రీ కేశనకుర్తి వీరభద్రాచారి

బాజీప్రభువు:— శ్రీ ఎ. సుబ్బారావు

తానాజీ:— శ్రీ నంమల సూర్యనారాయణ

నేతాజీ:— శ్రీ ఆరుమిల్లి శ్రీరాములు

శిష్యుడు:— శ్రీ అడవి విశ్వేశ్వరావు

సైనికుడు:— శ్రీ తంగెళ్ల కామేశ్వరావు

మురళీనాదము:— శ్రీ జోనా సామ్రాజ్

సర్వస్వామ్యములు
కృతికర్తవి

ప్రతులకు: కార్యదర్శి
కవితా ప్రభాస: భీమవరము.

ముద్రిణ
మహాంధ్ర, భీమవరమ్.
కా 72. ప్రతులు ౧౦౦౦
డి. డిక్. పి. కన్. ఎ 5593_46.
తేదీ 13—5—1947

# —: అవతారిక :—

"ఛత్రపతి శివాజీ" అను ఈరూపకమును ప్రచురించుటకు పురికొల్పినది

మిత్రశ్రీ తుమ్మలపల్లి వీరభద్రరావుగారి ఆదరము
పూజ్యశ్రీ పెద్దాడ రామస్వామిగారి ప్రోత్సాహము
గురుదేవులు శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారి ఆశీస్సులు.

పూజ్యమిత్రులు
శ్రీ తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి,
శ్రీ కొత్తమాసు వెంకటరత్నంగారలు

వర్ధమాన నటులు
శ్రీ యన్. వి. యల్. నరసింహాచార్యులు, శ్రీ కొచ్చెర్లకోట సత్యనారాయణ, డాక్టర్ పొన్నపల్లి సుబ్రహ్మణ్యంగారలు

కళాశాలా సహవ్రతులు
శ్రీ కపిలవాయి సన్యాసయ్య, శ్రీ సన్నిధిరాజు రామమూర్తి, శ్రీ గుడిమెట్ల సుబ్బిరెడ్డిగారలు ముద్రించుటకు ప్రోత్సహించినారు.

ఈరూపకములో శివాజీ జీవితమునందలి అద్భుత చారిత్రకసన్నివేశములను అగని సహవ్రతులైన బాజీమున్నగు మహానాయకుల ఆత్మత్యాగ వృత్తములను ప్రదర్శించుటయే పరమలక్ష్యము.

ముస్లిమ్ సోదరుల హృదయముల కావంతయు నొప్పికలుగరాదను ఆశయమును గ్రంథకర్త అసిధారా వ్రతముగా పరిపాలించినాడు.

కవితా ప్రభాసను చిత్రించి యిచ్చిన సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ అంకాల వెంకటసుబ్బారావుగారికి ఛత్రపతిముఖచిత్రమును చిత్రించిన ఆబాల్యమిత్రుడు సహాధ్యాయి, ఏలూరు మెట్రో స్టూడియో అధినేత శ్రీ వెంకటేశ్వరరావుకు, ప్రత్యేకశ్రద్ధతో పుస్తకమును ముద్రించిన మహాంధ్ర ముద్రాక్షరశాలకు శ్రీ ఆకుల సత్యనారాయణగారికి కృతజ్ఞత.

: కృతికర్త :

# సూత్రధారుడు

క్వణదణుకింకిణీ కలిత కాంచన కంకణ కాంచిమై రణ
న్మణిమయ శింజినీ ప్రకట నర్తనగాన ఝుళంఝుళ ద్విలా
సినియయి; జాళువా పసిడిసిగ్గుల మేలిముసుంగు మత్త్ కళా
ప్రణయినిజార్చెడిన్, చెదరి రాలెడి వేసవి పూలజల్లులో.

ఓదివ్యగాయకా! భావింపవోయీ!
ఓనవ్యభావుకా! ధ్యానింపవోయీ!
అవెప్రభాతసంధ్యా కలకలనినాదవిల సితదివ్యోషస్సులు
అవె సువర్ణపతాక నవయుగోదయారుణ కోమలరోచిస్సులు
ఓదివ్యగాయకా!
ఇవి స్వాతంత్ర్యవికాస యువభారతనిత్యవినిర్మల తేజస్సులు
ఇవి మదీయకవితా రసభావగీతికాతరంగితవచస్సులు
ఓదివ్యగాయకా!
శ్రీజయజయ నినాద మంజులగళ రంజిత దీక్షాంజలులవిగో
శ్రీప్రియభారత జనయిత్రీ చరణాంబుజ పూజాంజలులవిగో
ఓదివ్యగాయకా!
దివ్యభారతవీర నరనారీపవిత్ర రక్తాంజలులివిగో
నవ్యభారతహృదయ వికసిత కవితామృత గీతాంజలు లివిగో
ఓదివ్యగాయకా!



# ఛత్రపతి

## శివాజీ

### —: ప్రథమరంగము :—

**వైతాళికులు**

శ్రీశ్రీశ్రీ మహారాజరాజశ్రీ, శ్రీమదఖండ మహారాష్ట్ర క్షమా మండలాఖండలా! దిగంతవిశ్రాంతకీర్తి ప్రభామండల! స్వతంత్ర భారత నిర్మాణదీక్షామండితభుజోద్దండ! సత్యపరాక్రమ తేజోమండలీ పరివేషిత చండమార్తాండ! అశేషభారతవీరజన నవ నవోన్మేషితా శాలతాశ్రిత బాహుదండ! ఖండితారిమస్తక సమర్చిత చండికాపాద పుండరీక! భండనపాండితీ నిర్జితాహితచమూకాండ! సనాతనధర్మ సంరక్షణ దీక్షామండిత కోదండ! ప్రచండమరాట మత్త వేదండ వాహినీ పూజిత రాజదండ! ఆశ్రితరామదాస తపఃపరిపూత దివ్యత్రిదండ!...

: ఘంటికానాద పరంపరలు :

రాజకుమార కేసరి! మరాట కిరీట మనోజ్ఞమౌళి! వి
భ్రాజిత ధర్మపోషక! పరాక్రమ పాండుర దిగ్విభాగ! వీ
రాజి విశుద్ధతేజ! జిజియాజననీహృదయాబ్ధిచంద్ర! నీ
రాజన మంగళాశిష విరాజితమూర్తి! శివాజిపార్థివా!

: జై! జై!! జై!!! విజయ ఘంటికానినాదము! :

శివాజీ

వీరకుమారుల రక్తవర్షముచేగాని స్వాతంత్ర్య కల్పద్రుమము చిగురింపదు. కాని, దండనీతి సర్వదా అంతిమోపాయము. జయించిన రాజ్యముల పునర్నిర్మాణమునకు శాంతిస్థాపనకు మనసర్వశక్తులు విని యోగించుచున్న యీ సమయముననే మనకు మరల కత్తిపట్టవలసిన అవసరము వచ్చినది.

అమాత్యపింగళ్ జీ

మహారాజా! బీజపూరుసైన్యములతో అఫ్జలుఖాన్ మాతా భవానీక్షేత్రము తులసీపూరువరకు దండెత్తివచ్చినట్లు వేగులవలన తెలిసినది. ముట్టడిలో వజ్రపుర్‌తోపాటు అనేక జనపదములు రూపు లేకుండ నశించిపోయినవి. పాపము!!—

శివాజీ

వీరకుమారులారా! విశ్వమానవ కుటుంబములో మరాఠజాతి నశించుట భగవానుని ఆశయమెన్నటికి కాజాలదు. ఈపవిత్ర ధర్మ రాజ్యసాధనిర్మాణమున మనలను కర్మకారులుగ ఎన్నుకొన జగదీశుని ప్రార్థింపవలెను. పరాత్పరుడు మనశక్తిస్థైర్యముల పరీక్షింపనిదే యీ మహత్తర కర్తవ్యమును మన భుజస్కంధములపై మోపెట్టదలంపడు. అందు తొలిపరీక్షలో కృతార్థులమైతిమి. - ఇంకను పరీక్షాసమ యము ముగియలేదు. ఈసారి జగదీశుని మెప్పించి మనలను మన ముద్ధరించుకొని తోడి భారతసోదరుల నుద్ధరించు అధికారమునకై ప్రార్థింపవలెను.

తానాజీ

మహారాజా! ఆజ్ఞనందుకొని ససైన్యముగ ఇదే సహ్యాద్రిసీమ నుండి వచ్చుచున్నాను. అనంతరకర్తవ్య మాజ్ఞాపింప ప్రార్థన.

శివాజీ

వీరకుమారులారా! ఎటుచూచినను మనకు శత్రువులే! మన కర్తవ్యదీక్ష ధ్రువతారవలె అచంచలము. అకుంఠిత స్థైర్యముతో ఆత్మవిశ్వాసముతో శత్రువును ఎదుర్కొనుటయే.

అమాత్యపింగళ్ జీ

వజ్రఘుర్ ముట్టడిలో మరాఠా సేనలు సంపూర్ణముగా నశించినవి. విజయగర్వముచే బీజపూరు సేనలు మీద వచ్చిపడుచున్నవి.

శివాజీ

నిజమే! బలవత్తరమైన రిపుసమూహము ఎదిరించ వలసి వచ్చుచున్నది అఫ్జుల్ ఖాన్! ఆరితేరిన వీరుడు. పదివేల కాల్బలము! ఏమి? ఒక మహారాష్ట్ర జాగీరుదారుపై బీజపూరు సుల్తానువారి సర్వసైన్యములు కదలివచ్చుచున్నవిగదా!

వైతాళికులు

శ్రీ శ్రీ శ్రీ శ్రీమాన్ పూజ్యశ్రీ, శ్రీభగవాన్ సమర్థ రామదాసస్వామి గురుదేవ ప్రభువులవారు జై! జై! జై! : ఘంటికానాదము : :రామముని భక్తిపారవశ్యమున పాడుకొనుచు ప్రవేశించును :

రామదాసు

శ్రీరామా! నీరదశ్యామా!
సుఖదామా! రఘూత్తమా!
దీనవత్సలారామా! సాధుసంతవిశ్రామా!
జయజయ రఘువీర సమర్థ!
శ్రీరామా! నీరదశ్యామా!॥

: శ్రీ శివాజీ నమస్కరించును :

శివాజీ

పూజ్యపాదులు శ్రీరామదాసస్వామి గురుదేవులకు శివా నమస్కారములు.

రామదాసు

:లేవనెత్తి: రామ్ రామ్. బ్రహ్మార్పణమస్తు. సమస్త మంగళా వాప్తిరస్తు.

తా.నాజీ : నేతాజీ ప్రభృతులు

: నమస్కరింతురు :

రామదాసు

రామ్ రామ్. కృష్ణార్పణమస్తు! భగవానుడు మిమ్మందర ననుగ్రహించు గాక!

శివాజీ

మహాభాగా! దక్షిణాపథమంతయు అన్యాక్రాంతమై అల్లకల్లోలమై అరాజకములో అట్టుడికి పోవుచున్నది. జాతి సర్వశక్తులు రిత్త పోవుచున్నప్పుడు కనులారగాంచి ఊరకుండ లేము. ఊరకొనక, సాధింప గల్గినదేమియు కన్పడుట లేదు, సాధించినను "రాజ్యాంతే నరకం ధృవమ్మ" ని శాస్త్రములు ఘోషించుచున్నవి. మాబోటి ప్రాకృతులు కర్తవ్యతా విమూఢులై, కన్నులు నులుపుకొనుచు కూలబడి కూర్చొనుచున్నారు.

రామదాసు

వత్సా! నీధర్మ జిజ్ఞాసకు సంతోషము ఏనాడో కురుక్షేత్రమున శ్రీకృష్ణుడు పూరించిన పాంచజన్య శంఖారావము గీతానాదముగ

నేటికిని తరంగితమై భారతీయుల హృదయములలో ప్రతిధ్వనించి విజయుని కానుద్బోధించుచున్నది. కర్మవీరులగు మరాఠ కుమారుల కింత కన్న ప్రబోధింపవలసిన దేమున్నది?

ప్రాణము గడ్డిపోచవలె ఆత్మసమర్పణ మాచరించి పౌ
రాణిక యోధులెల్లరు పురాతన సంస్కృతి నిల్పినారు! మీ
బాణము నాశ్రయించినది భారత భాగ్యము నేడు, విశ్వక
ల్యాణ కళావిలాసములు హైందవజీవన చారితార్థ్యముల్.

శివాజీ

మహాత్మా! కర్తవ్యము గోచరించినను, తత్సాధనకు కేవలము మనుష్యశక్తి చాలదు. మహదాశయములను కార్యరంగమున ఆచరణలోనికి దెచ్చునప్పుడు మానవుని శక్తియుక్తులకన్న దివ్యకరుణాకటాక్షవీక్షణములే యెక్కువగా తోడ్పడగలవు! రాజ్యము పోనుపోను ప్రవృత్తిపరమై ఐహికవిషయచింతాలంపటత్వమున బడద్రోయును. ముముక్షువులకు రాజ్యభారము ప్రతిబంధకమేగదా!

గురుదేవా!

సంపాదించితి శ్రీ భవానికృప అస్మన్మాత ఆశీస్సులన్
పెంపున్ గన్న మరాఠరాజ్యము, శివాపేక్షా నిమగ్నుండనై
శంపాభంగురమైన రాజ్యరమ నీపద్మాంతమే నాత్మకాం
క్షింపన్, ధర్మగవేషణా పథమునన్ శిక్షించి రక్షింపవే!

రామదాసు

వత్సా! శివా!

నీధర్మతాత్పర్యమునకు పరమసంతోషము.

శివాజీ

గురుదేవా! శరణాగతిని మన్నింపప్రార్థన.

శరణము కర్మయోగపథ సచ్చరణవ్రిత వీరధర్మముల్
శరణము తత్వమార్గ విలసత్సద సచ్చిదచిత్ప్రబోధముల్
శరణము సత్యవాజ్ఞ్నియమసాగసనాతన ధర్మదీపికల్
శరణము రామదాసమునిసత్తము దివ్యపదారవిందముల్

: రామమునికి పాదనమస్కారము సల్పును :

: రామదాసు లేవనెత్తును :

శివాజీ

దేవా! మధ్యాహ్నభిక్షాసమయము సమీపించుచున్నది. సమయమునకు విజయముచేసినారు! మాపున్నెము పండివచ్చినది. శిష్యుడు సమర్పించు భిక్షావందనములు స్వీకరింప ప్రార్థన.

రామదాసు

వత్సా! నీభక్తికి సంతోషము. అట్లే స్వీకరించెదను.

శివాజీ

కృతార్థుడను. జగదేక వంద్యులగు గురువర్యులకు భిక్షాప్రదానముగా నమర్పింపదగిన దేమిగలదు? గురుదేవా! నాయీరాజ్య సర్వస్వమును భిక్షావందనములుగా తమపాదార్పణము చేయ అనుజ్ఞ వేడుచున్నాను.

రామదాసు

వత్సా! నీధర్మతాత్పర్యమునకు సంతోషము.

శివాజీ

చరితార్థుడను.
సముద్రై యెవ్వాడు ముక్తకర్మచయుడై సన్యాసియై రాజ్యభారము దాల్పంగ ననుగ్రహించెనట నాబ్రహ్మజ్ఞధర్మస్వరూ

పుమహాత్ముఁ డ ప్రియదర్శనున్ పరమతిఁ పూజించిఅర్పింతురా
జ్యము నస్మద్గురు రామదాసముని పాదాంభోజయుగ్మంబునన్
:కిరీటమును కరవాలమును వినమ్రుడై రాముని పాదపీఠిక పైనుంచును:

రామదాసు

; పరిగ్రహించి : కృష్ణార్పణమస్తు

శివాజీ

కృతార్థుడను.

వైతాళికులు

జై జై జై! శ్రీ శ్రీ శ్రీ భగవాన్ పూజ్యశ్రీ శ్రీమాన్ మహా
రాజరాజశ్రీ శ్రీసమర్థ రామదాసస్వామి గురుదేవమహారాజా! జై జై జై
: ఘంటారావములు :

రామదాసు.

వత్సా! శివా! సర్వరాజ్యమును భిక్షాప్రదానముగా మాకు
సమర్పించితివిగదా? ఇకనీవేమి చేయసంకల్పించుచున్నావు?

శివాజీ

తమ పాదసేవ.

రామదాసు

వత్సా! శివా!
సంతోసించితి నీదుధర్మమతికిన్ సచ్ఛీలసంపత్తికిన్
కాంతారంబులముక్కుమూసికొనుమోక్షాకాంక్షికిన్ రాజ్యదు
ర్దాంత ప్రాభవమేల? నా ప్రతినిధిత్వంబిచ్చితిన్ సర్వభూ
తాంతర్యామి జగద్గురుండెపుడు తోడై నిన్నురక్షించుతన్

: కిరీటమును కరవాలమును తిరిగి శివాజీచేతి కందిచ్చును :
సత్యముకొరకై, ధర్మసంరక్షణార్థమై ఈకత్తిని ధరింపుము.

శివాజీ

దేవర ఆజ్ఞ శిరసావహించుచున్నాను.

**రామదాసు**

ఈకిరీటమును రాజాభిజ్ఞానములను యథాపూర్వముగ ధరించి నిర్వికల్పముగ రాజ్యము నేలుకొనుము.

శివాజీ

ఈశివా తనధర్మాధికారమును పూజ్యశ్రీ శ్రీమాన్ సమర్థరామదాస మునివర్యుల చరణారవిందముల సాన్నిధ్యమున పరిగ్రహించెనని ఎన్నటికిని మరువలేడు.

**రామదాసు.**

ఈప్రతిజ్ఞను త్రికరణశుద్ధిగ అనుష్ఠింపుము.

**శివాజీ**

మహాభాగా! సదాలోకాభ్యుదయమునకై నాసర్వమర్పించుటకు వెనుదీయనని ఇదే తమ చరణారవిందముల ప్రమాణము చేయుచున్నాను.

**రామదాసు**

విజయీభవ!

శివాజీ

మహాప్రసాదము. నాయీప్రాతినిధ్యమునకు చిహ్నముగా ప్రత్యభిజ్ఞానమైన అనుగ్రహింప ప్రార్థించుచున్నాను.

రామదాసు

సన్యాసి అనుగ్రహించునది కాషాయాంబరము.

శివాజీ

మహాప్రసాదము.

రామదాసు

కాని, తీవ్రదీక్షను, పరమధర్మనిష్ఠను, అసిధారాత్రతమును కోరుకొనుచున్నావు. : ఇచ్చును :

శివాజీ

చిత్తము. మహాపప్రసాదము.

: కాషాయధ్వజము నెగురవైచి :

సహవ్రతులారా! శ్రీ శ్రీ శ్రీ పూజ్యశ్రీ భగవాన్ సమర్థరామ దాసస్వామి మునివర్యుల తపఃపరిపూతమైన యీపవిత్ర కాషాయము స్వార్థత్యాగుల సామ్రాజ్య పతాకమై విజయధ్వజమై వెలయుగాక! జై! భగవాజెండా. :జయ జయ ధ్వానములు: వీరకుమారులారా! భారత భాగ్యోదయమైనది. నేటినుండి మహారాష్ట్ర చరిత్రలో స్వర్ణ యుగము ప్రారంభమైనది.

: సైనికులు వచ్చెదరు. జయజయనాదాలు :

గురుదేవా!

విజయశ్రీగొనివచ్చు వీరసమరావేశమ్ము మీ పాదపం
కజ సాన్నిధ్యమువల్ల కల్గినది దీక్షాబద్ధచేతస్కులై
ప్రజలొక్కుమ్మడి వచ్చినారలదె సామ్రాజ్యధ్వజోద్ధారులై
యజనార్థుల్ వలె కన్గొనుండుకరుణాపాంగావలోకంబులన్

కాటికి కాల్సాపి కంటనీరిడుతల్లి
పిడ్డ్యాని వచ్చిన వీరుడితడు
కోరివరించి చైకొన్న విలాసిని
వేడికౌగిలి వీడు వీరుడితడు
పట్టాభిషేకమా పదినాళ్ళలో సింహా
పీఠిక దిగివచ్చు వీరుడితడు
కానక కన్నట్టి కసిగందు పురిటింట
వీడి పోరగవచ్చు వీరుడితడు
మమతలు వీడి మోహపాశము విదల్చి
స్వార్థమును ద్రోసి వాత్సల్యమడచి; ధర్మ
దేవతకు అంజలి ఘటించు దేశభక్తు
లరయు చున్నారు దేవర ఆజ్ఞకొరకు.

: సైనికులు జయ జయ ధ్వానములతో నమస్కరించెదరు:

పతాకవందనము : బృందగీతి

శ్రీజయ పతాక! శుభదా!
జయ జయ వరద శ్రీ॥
విశ్వవిహార ! విజయ విలోల
జనగణ రమణ ।భవభయ హరణ
స్వాతంత్ర్య తేజోవిశాలావనీ భారతభాగ్యవిధాయి
స్వేచ్ఛా గగన విశ్రుతవిహారిణీ
అరుణా వరణా భరణా
స్వాతంత్ర్య వికాస ! శోభావిభాస
భారత మానసహారీ శ్రీ॥

రామదాసు

బాధల కోర్చియుక్ భరత వర్షమువీడదు వీరధర్మముల్
నాథుల బాసివీరలలనల్ చితికెక్కిరి శీలరక్షకై
సాధక దీక్షగైకొనుడు సైనికులార రయంబునన్ జగ
న్నాథు రథంబు సాగినది ధర్మపథాన జయోన్ముఖంబుగా.

పోవుడు వీరులార రణభూమికి మీకుజయంబు కల్గెడున్
దైవము తోడుగాగలదు తథ్యమునమ్ముడు, మాతృదేశ సే
వావసరంబునందసువులర్పణసేయు పరాక్రమోన్నతుల్
భావియువప్రపంచమున భాసిలుగావుత మేలుబంతిగా.

: రాముని నిష్క్రమణము :

ప్రతీహారి

:ప్రవేశించి: జయము జయము మహారాజులకు... ...మహా రాజా! శ్రీకృష్ణాజీ భాస్కరదేవ్ మహాశయులు రాయబారియై వచ్చి తమదర్శనార్థము వేచియున్నారు.

అమాత్యపింగళ్జీ

ప్రవేశపెట్టుము.

: ప్రతీహారి నిష్క్రమణము :

కృష్ణాజీ

:ప్రవేశించి: జయము జయము మహారాజులకు

శివాజీ

రామ్‌రామ్. స్వాగతము!!

అమాత్యపింగళ్జీ

సుస్వాగతము... మహాశయులకు!!

కృష్ణాజీ

:ఆసీనుడగును:

పింగళ్‌జీ

మహాత్మా! తమరాకకు గలప్రయోజనమును విన శ్రీ మహారాజులు కుతూహలులై యున్నారు.

కృష్ణాజీ

శ్రీ శ్రీ శ్రీ మహారాజశ్రీ శివాజీ ప్రభువర్యులకుజయ పరంపరాభ్యుదయములు.

శివాజీ

శ్రీ అఫ్‌జుల్‌ఖాన్ మహావీరులకు మాసుహృదభినందనములు

కృష్ణాజీ

శ్రీ శివాజీ ప్రభువర్యులకు ఖాన్‌సాహేబ్‌జీ వారిఅభినందనములు

పింగళ్‌జీ

తమసందేశమును అనుగ్రహింప ప్రార్థన.

కృష్ణాజీ

శ్రీ శ్రీ శ్రీ శివాజీ ప్రభువులవారికి—తరతరములనుండి శ్రీబిజాపురీసుల్తానువారు సుహృద్భావముతో తమకుటుంబమును మన్నించి గౌరవించుచున్నారు. తరతరాలనుండి అవిచ్ఛిన్నముగా వచ్చుచున్న ఈసంబంధ బంధమును దృఢతరము చేయుటకుబదులు ఉచితజ్ఞుడైన శివాజీప్రభువు పెద్దలఆచారమును మీరుట స్వకుటుంబభవితవ్యమునకు గాని దేశక్షేమమునకు గాని ప్రజాభ్యుదయ శాంతిసంపదలకు గాని సమాత్రము తోడ్పడజాలవని ఖాన్‌వారు హెచ్చరించుచున్నారు. ఈ ఆప్తవాక్యమును మన్నింపనిచో అప్రతిహతమై బీజపూరుసేనలు గత్యంతరములేక కదలివచ్చును. కోరినచో ఖాన్‌వారు తమకు దర్శనమను గ్రహింప సిద్ధముగానున్నారు.

శివాజీ

శ్రీ పూజ్యశ్రీ భాస్కరదేవ పండితులకు మాకృతజ్ఞత. ఈహితబోధ మాకేగాక సకలమహారాష్ట్రదేశమునకు, భారత భవితవ్యమునకు గూడ వర్తింపగలదని, వేదమార్గప్రతిష్ఠాపనాచార్యులగు భాస్కరదేవులు ఇదివరకే గుర్తించియుందురని మావిశ్వాసము. ఏమందురు మహాశయా!

కృష్ణాజీ

మహాప్రభూ! చెప్పవలసినదంతయు చెప్పినాను - నేనురాయబారినిగదా?

శివాజీ

రాయబారులు మాత్రమేగాదు! ధర్మనియంత్రాధికారము గల బ్రాహ్మణులుగూడ. ఆర్షభూమిని బ్రహ్మతేజస్సుక్షీణించిన క్షాత్రధర్మము మాత్రమునిలుచునా! మహానుభావా!

కృష్ణాజీ

కలియుగములో కానిగౌరవము మాకిచ్చుచున్నారు ప్రభువులవారు. ఏమిబదులు చెప్పగలను?

శివాజీ

మహాశయా! తమకు చెప్పవారున్నారా?

: తెరలో : వైతాళికులు

ఎలనాగమ్ములు తాపభారమున బృంహించెన్ కరంబెత్తి, ఘంటలు మ్రోగెన్ ఘడియారశాల; పరగెన్ ఢంకానినాదమ్ము; సేనలు విశ్రాంతికి చేరసాగినవి స్కంధావార గర్భంబులన్
తలపైదోచె నభోంతరాగ్రమున మార్తాండుండు చండాంశుడై

ప్రిథమరంగము.

శివాజీ

రేపు కొలువులో భాస్కరదేవులు మావిజ్ఞప్తిని వినగలరు.

కృష్ణాజీ

చిత్తము.

శివాజీ

అమాత్యపింగళ్ జీ! భాస్కరదేవులను భవానీ మందిరములో విడిదిచేసి సమస్తగౌరవ మర్యాదలతో అతిథిపూజచేయుడు.

: తెర :



# ★ ద్వితీయరంగము ★

: ప్రవేశము : :భారతీ తీర్థుడు:
:మహారణ్యము : నదీతీరము: :ఆశ్రమపరిసరము:

భారతీ తీర్థ

ద్వంద్వాబద్ధమైన ప్రాణికోటి; వికారమయమైన జీవనము; అవ్యవస్థితమైన సృష్టిని పరమేశ్వరుని కంటగట్టి ఆతనిశిల్పకళకు గూడ కళంకము నాపాదించుటకు నామనస్సు అంగీకరించుట లేదు. పరాత్పరా!

దేవుడు విశ్వశిల్పి; జగత్స్థితి కారణమై జనావళిఁ
గావగలండటంచనిననమ్మినునేను; దయామయుండవౌ
నీవె సృజించితేని అననీస్థలినంతయు పాపదుఃఖతా
పావిలమైన ఘోరనిరయప్రతిమాన మొనర్చియుందువా!

ఓ బీజపూర్ సైనికులారా! నేనుగాని వజ్రఘర్ ప్రజలుగాని మీకేట్టిఅపకారమును చేసియుండలేదే? జనపదమునంతయు అగ్నిదగ్ధముచేసినారు!! ఘోరము! హోయి-సేనాపతియైన అఫ్‌జులుఖాన్‌కు విన్నవించి వీరికి తగినశిక్ష — శిక్షచేసిననేరమునకు ప్రతిక్రియ కాజాలునా? పాపము! ఈసైనికులేమిచేసెదరు! సేనాపతి ఏమిచేయగలడు! ఘోరమారణకర్మమే హింసాదౌర్జన్యపుప్రకృతిపరికర్షయే పరాక్రమకృత్యముగ వీరధర్మముగ ప్రపంచములో చెల్లుబడియగుచున్నవి. వజ్రఘర్ ముట్టడిలో శతఘ్నిఘాతముచే మృతుడైన నాఏకైక సుతునికై విచారింపను. నిర్భాగ్యుని నన్నువీడి నాకలోకమున కేగిన సాధ్వీమణి నాసహధర్మిణికై దుఃఖించుటలేదు—కాని—సోదరమానవులకు సంఘటిల్లిన విపత్తునకుమాత్రమే బాధపడుచున్నాను.

అన్యోన్యవైరముచే మానవ కుటుంబము అగ్నికుండమున కాహుతియగుచున్నది. యుద్ధజ్వాలలు భూగోళము నంతయు ఆకలి మంటలు నిరుపేదల హృదయ కుహరములనువలె, దహించుచున్నవి.

ఆకలిమంటచే నుడికి అల్లలలాడి కృశించి, మానవా
నీకముమాడిపోయినను నీహృదయమ్ము ద్రవింపదేమి? దే
వా! కృపమాని, దీనజనబాధలగానక యుందువేల? భూ
లోకమునెల్ల స్వార్థపరులుగా కఠినాత్ములు కొల్లగొట్టగా!

అదిగో! ఆకాశముగూడ ఎఱ్ఱవాఱుచున్నది. దీనజన హృదయములలో మండుచున్న ఆకలిమంటలు ఆకాశమునుగూడ ఆవరించుచున్నట్లున్నవి. యుద్ధభూములలో ప్రవహించుచున్న రుధిరవాహినులు పొంగి ఆకాశముగూడ నెత్తురు వరదలలో ముంచియెత్తుచున్నవి.

జగదీశ్వరా! క్షుధాగ్నిజ్వాలా కీలితారుణకిరణ ప్రభలచే రక్తవాహినీసిక్తసంగరక్షోణీశోణితగ్వ్యుతులచే నవ్యయుగోదయోషఃకాంతుల నుకల్పించుచున్నావా. ఈబాధలన్నియు భూదేవి నవ్యయుగోదయమునకై అవశ్యము అనుభవింపవలసిన ప్రసవవేదనలేనా? ప్రభూ! ఓహో! వ్యాధానుధావితమైన ఉష్ట్రపక్షివలె యథాస్థానమునకు చేరినాను!!

ఓ అల్పమానవుడా! కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య ప్రేరితుడవై ఈభూగోళములో నివసించు నీహక్కును దుర్వినియోగముచేయుచున్నావు. దయ దాక్షిణ్యము ఔదార్యము ప్రేమ క్షమ తపస్సు—సర్వమునీలోనశించినవి. ఓ నీచమానవుడా నీకుతగిన శాస్తిజరుగుచున్నది.

అదుగో! అదుగో! చిమ్మచీకటులు అఱ్ఱులుసాచుకొనుచు ప్రళయకాల కాలజీమూతౌఘములవలె భూనభోంతరాళములఁ గమ్మి ఝంఝూనిలవేగాలోలములై మీఁదవచ్చిపడి గర్జించుచున్నవి. భీషణ నిర్ఘోషములు సల్పుచు ఘోరనిర్ఘాతసంఘాతములు వసుంధరావలయ మును బ్రద్దలుకొట్టుచున్నవి. మినుకు మినుకుమను ఆశాద్యుతుల నీను మానవజీవన జ్యోతియు స్నేహవిహీనమై ఆరిపోవుచున్నది. అగ్నిపర్వ తములు ఆకాశమునుచీల్చుకొని ప్రచండధ్వానములు సల్పుచు ధూమ జ్వాలాభీలములై బ్రద్దలగుచున్నవి. సప్తార్ణవములు అట్టుడికిపోయి ఘూర్ణిల్లు చున్నవి. మృత్యుదేవత వికటాట్టహాస తాండవములో సామ్రాజ్యము లు నలిగిపోయి రక్తస్రావములో మునిగిపోయి దొర్లుచున్నవి.

అదుగో! మహాకాళి! విశ్వవిశ్వంభరావలయమును శ్మశానవాటి కగమార్చి బ్రహ్మశిరస్సుతో రుధిరపానముచేయు చున్నది.

ఓ పంచభూతములారా! బాగుగనే విజృంభించుచున్నారు. ఇంకను-మీ మీశక్తికొలది విజృంభించి—యీసృష్టినంతయు రేణువు లుగ, అణువులుగ పరమాణువులుగమార్చివైచుడు. జగదీశ్వరా! ఇది యేనా? నీఅభిమతము!

సకలమానవ కర్మసంసారమెల్ల
శాంతిలేక సంతతరణాక్రాంతమగుచు
సృష్టిపరిణామ ధర్మమోచెప్పవోయి!
క్రూరలీలావిలాస ప్రసారదృష్టి
కష్టపూరితలోకమ్ముగాంచి, వికృత
మందహాసమ్ము సల్పెడి చందముగను

కానుపింతువు నీవు నాకనులకింద్ర
జాలమహిమ పోలిక; భ్రాంతి సదృశముగను!

వ్యావహారికమగు కర్మజగత్తులో శాంతియెచ్చటిది? సామరస్య మెక్కడిది! కృత్రిమ ప్రపంచమునువీడి ప్రశాంతమైన ఈఅరణ్యసీమలో వసించెదను. స్వచ్ఛమైన యీనిర్మలప్రకృతిలో నాహృదయసంతాపము కొంచెముచల్లారగలదు.

ప్రశాంతవాతావరణము నభిలషించియే మునులు ఆశ్రమవాసులై తుషారాద్రి శిఖరములను చేరుకొనుచున్నారు.

ఈరెండుకొండల నడుమనుండి, యిరుకైనలోయలో దారిచేసికొని, సంపన్నుల దయారసమువలె, ఈనిర్ఝరిణి ఎంతరమణీయ భయానకముగా ప్రవహించుచున్నది!

ఉత్ఫుల్లకమలినీకల్హారకేసరకరాళకలితకల్లోలమాలినీరమణీయమై నీలనీరదాకాశవికాససలిలప్రకాశమానమై యీసరస్సు ఎంత శోభాయమానముగనున్నది! సరోవరతీరమున సంచరించు ఈహరిణ కిశోరముకన్నులలో అమాయికత్వము ప్రతిఫలించుచున్నదే! పెద్దపులి గాండ్రింపువిని ఉలికిపడి: ఏమి! యీభీకరనినాదము!!! గుండెలదరు ఈగాండ్రింపు ఏవ్యాఘ్రఘోషమోగదా!

కొఱుదప్పల రాల్చుచు కొదమలేళ్లు
బెదరి దుముకుచున్నవి ముండ్లపొదల; పోయి
పోయి ఏవాడికోరలపులి ముఖమ్ము
చొచ్చునకట! యీచిన్నారి సొగసువగలు!!

ఛీ! భూరాజ్యమునువలె, వనరాజ్యమునుగూడ, క్రూరమృగరాజులే, పరిపాలించుచున్నారు. నిసర్గరమణీయమగు నీచన్యప్రకృతిలోగూడ పాపముశాంతించుటలేదు.

బలహీనులైన వారలు
బలవంతుల చేతజిక్కి బాములువడుటే
యిలగల సృష్టిరహస్యమొ
తెలియన్ జాలను నిజమ్ము దెల్పుము దేవా!

: తెరలో :సంగీతము:

: పాడుకొనుచు రామదాసస్వామి ప్రవేశము :

భారతీ తీర్థ

తమోవిలమగు పూర్వదిశావలయమున నవోదితుడగు అరుణునివలె, కాషాయకాంతులు దశదిశల విరజల్లుచు ఇంద్రియానాతటమును అధిరోహించుచున్న ఈమహామునిపుంగవు డెవరు? —— ఈతత్త్వైకజీవి ఆలపించు గీతికలోని పరమార్థమునాకు బోధపడుటలేదు గాని గానముమాత్రము నాముగ్ధహృదయమును పురాతనసత్యమువలె స్పృశించి పరవశముచేయుచున్నది.

రామదాసు :శిష్యునితో:

నరసంచారము లేని యీకాంతారములో ఒంటరిగానున్న యీయునక డెవరు? పాంథుడై యుండునా? అట్లైన పాదరక్షలుగాని జలకలశముగాని లేవే!

వత్సా! ఎవరక్కడ? వత్సా! ఎవరక్కడ?

భారతీ తీర్థ

:మౌనము:

రామదాసు

నాయనా!

అంతరించినవి నిశాంధకారములు
జగద్బాంధవుని దివ్యకరముసోకి
అలముకొన్నవి సమస్తాశావకాశముల్
సర్వచైతన్య విలాసరుచులు
సాగుచున్నవి వనస్పతుల రెక్కలువిప్పి
పక్షులెల్ల గవేషపథము బట్టి
పోవుచున్నది నూత్న జీవనోత్సాహియై
ఇరుకకొండలదాటి యింద్రయాన
ప్రకృతిపులకరించె ప్రత్యూషపవనాల
పలుకరింప బదులు పలుకకుండ
ఈఅరణ్యమందు ఈనదీతీరాన
నిల్చితేల వత్స! నీడవోలె!

భారతీ తీర్థ

దయామయా! నమస్కారములు.

రామదాసు

రామ్! రామ్! సమస్తమంగళావాప్తిరస్తు!

భారతీ తీర్థ

అవ్యాజమగు మీఆశీస్సుగూడ నన్ను కలవరపెట్టుచున్నది. మహాశయా! నన్నేలపలుకరించితిరి? ఈదీనునివలన జరుగుప్రయోజన మేమియునులేదే?

రామదాసు.

ముప్పదివసంతముల తారుణ్యము నీముఖమున తొలుకాడు చున్నది. ఏల ఇట్టినైరాశ్యగీతాలాపన మొనరింతువోయి!

భారతీ తీర్థ

జననిగర్భస్థాననుండి పుట్టిన క్షణంబె
కెవ్వుకెవ్వన నేడ్చితి నవ్వకుండ
ఏడ్చుటెలకో తెలిసినదిపుడునాకు
దినదినంబును గడచెడు తెరగుజూడ.

రామదాసు

వత్సా! నిన్ను భగవానుడనుగ్రహించునుగాక!

భారతీ తీర్థ

భగవానుడు దీనుల మొరలాలకించునా?
దేవుడు ధర్మమూర్తి; భువితీరిచి దిద్దునటందు రేలదు?
ఖావిలమూర్తులౌ ప్రజలఆర్తినిబాపడు? దీనవేదనా
రావములాలకించెడి పరాత్పరుడుండియు మిన్నకుండి దో
షావృతరాగభోగమలినాత్ముల విశ్వము నేలనిచ్చునా?

రామదాసు

నాయనా! నీటిలోనివసించు చేపకేదాహమైన ఏమిచేయవల యును! జగదీశునిచిద్విలాసములు అనంతములు. సృష్టిస్థితులనే తర్కించుచున్నావు?

భారతీ తీర్థ

మహాభాగా! సమాధిబద్ధముగాని కవిభావనవలె, అనౌచిత్య

భూయిష్ఠమైన యీవికృతప్రపంచప్రకృతిపై నా మనస్సు తిరుగబడు చున్నది. సృష్టినిగూర్చి, స్రష్టనుగూర్చినాకుగూడకొన్ని అభిప్రాయము లున్నవి.

రామదాసు

నాయనా! ఈభూగోళమును చంద్రమండలమును దృశ్యాదృశ్య సకలచరాచరప్రపంచములను నిత్యచైతన్యముతో తాండవింప జేయు చున్న తేజోరాశి మనమీద అవ్యాజకృపతో వెలుగు వెల్లువలు కురిపించుచున్నాడు. కన్నులుదెరిచి చేతులుమోడ్చి ఆజ్యోతిర్మయునికి అర్ఘ్యాంజలినర్పించవోయి!

భారతీ తీర్థ

దృశ్యాదృశ్యమైన సకలచరాచర ప్రపంచములను సృష్టిసల్పిన బడలికచే సృష్టికర్త యోగనిద్ర చెందినాడు. ఇంకనునిద్రించుచునే యున్నాడు. ఆలనపాలన లేని సృష్టినేటికీవిధముగ పరిణమించినది. స్రష్ట మేలుకొని తనసృష్టి ఏగతికివచ్చినది ఒకమారుపరికించిన, ఆతనిగుండె బ్రద్దలై ఇకమీద ఎప్పుడును సృష్టిసల్పడు.

స్వార్థలోలతను జనులన్యోన్యహనన
కాములై పోరుచున్నారు; కానవయ్య
రక్తవాహినీ సిక్త సంగ్రామసీమ
మృత్యుదేవత భీకరనృత్యసరణి.

రామదాసు

వత్సా! నీనామధేయమేమి? నీవెవ్వరవు? ఈనైరాశ్యగీతాలాపనకు కారణమేమి?

భారతీ తీర్థ

నా పేరు

పేరున కేమిగాని నిరుపేద నోకానోకనూనవుండ, సం
సారముకూలిపోయినది; మానవజీవనమెండమావి ని
స్సారము స్వప్నమంచరసి సత్యముకానకపోయితిన్ నిరా
ధారుడ; తత్వవిద్యలకు తర్పణమిస్తితి జాహ్నవీతటిన్

రామదాసు

నాయనా! నీవేనా భారతీ తీర్థవు.

భారతీ తీర్థ

అయిన నేమి?

రామదాసు

వత్సా! నీయుదంతమంతయు మాకీవరకే తెలిసినది. వ్యజఘుర్ ముట్టడిలో మీకుటుంబమునకు సంభవించిన విపత్తునిని మాశివ చాల విచారించినాడు. నీకొఱకై సేవకులను పంపినాడు- నీవంటి పండితుడు విధివిపరిపాకమున విపత్తులు వచ్చినంత మాత్రమున ధృతిసెడి అవివేకమున పడరాదు. నీవుమహావిజ్ఞానివి. కాశీలో నవద్వీపములో జిజ్ఞాసతో విద్యాభ్యాస మొనర్చిన వేదవేదాంగ పారంగతుడవు. నీవు తిరిగి కర్మపథమును కార్యశీలుడవై నిర్వహింపగలవని నావిశ్వాసము.

నాయనా! ఇట్లేల ఒంటరిగా ఈ అరణ్యమునకు వచ్చినావు.

భారతీ తీర్థ

చిత్తశాంతికై అరణ్యవాసముచేయ వచ్చినాను. కాని!- వనవాసములో గూడ శాంతిలేదని గ్రహించినాను.

రామదాసు

నాయనా! నాభియందు కస్తూరిగల మృగము పచ్చగడ్డికొఱకై పరుగులు పెట్టుచున్నది. వెఱ్ఱివాడా! శాంతి బాహ్యప్రపంచములో

ఎచ్చటను లేదు. శాంతి నీఆంతరప్రకృతిలో నీ హృదయాంతరాళమున ఇమిడి యున్నది. నిర్మలశాంతిజ్యోతినిగాంచ నిచ్ఛగింతు వేని అంతర్ముఖుడవై ఆత్మవ్యవసాయమునకుపక్రమింపుము. నాయనా! ప్రస్తుతము నీలక్ష్యమేమి? ఎచ్చటకు పోవుచున్నావు?

భారతీ తీర్థ

అనంతకోటి గ్రహతారకా నివహములతో, ద్వాదశాదిత్య మండలములతో సంకర్షణానిరుద్ధ సూర్యభూచంద్రగోళములతో ఖగోళమున శూన్యావకాశమునబడి ఎచటికో ఎచటికో పోవుచున్న బ్రహ్మాండములవలె నేనును పోవుచున్నాను. ఎచ్చటికి పోవుచున్నానో నాకే తెలియదు.

రామదాసు

నాయనా! సమస్త గ్రహములు నిర్ణీతగణితబద్ధమై విశ్వశిల్పములో అంతర్వాహినిగ నినదించుచున్న ఒకమహాలయకు గానమునకు అనుస్యూతముగా నడచుచున్నవి. ఆవిశ్వగానమునకు తన జీవితమును శ్రుతిగల్పిపాడుకొను ముముక్షువే యోగసిద్ధుడు. ముక్తజీవి. నాయనా! గ్రహతారకలు లక్ష్యము లేనివి గావు.

భారతీ తీర్థ

నాకు ఏలక్ష్యమును లేదు- ఏదారి తెన్నులు గన్పించుట లేదు! తోచిన దారినిబట్టినాలుగు త్రోవలు గలియు ఈ శృంగాటకమును చేరినాను. ఇకమీదదారి గన్పించుటకు లేదు. ఈనాలుగుదారులు ఎచ్చటకు పోవుచున్నవి? ఈనదీమార్గము ఎచ్చటకుపోవును?

రామదాసు

ఈనదియేనీకు మార్గముజూపుగాక. వత్సా! నీకులక్ష్యమేదియు లేదు- సరే! కాని, ఈనదికి మాత్రముకలదు. ఈనది ఎక్కడ ఏ

కొండచరియలలో, పసెలయేరుగా నుత్పన్నమైనదో- కాని- ఇసుకలో యలలోను క్షేత్ర భూములలోను మార్గము చేసికొని దుర్గమారణ్యములను గమించి పోవుచున్నది ఈనదికి లక్ష్యము సముద్రము- కాని పోవ లయు మార్గము తెలియదు. కొండలడ్డువచ్చిన దొలుచుకొని యైనను పోవును. కావున లక్ష్యమైన సముద్రమును నిశ్చయముగా చేరగలుగు చున్నది.

భారతీ తీర్థ

మహాభాగా! ఉదయభానుని కోమలకిరణస్పర్శచే విడినదు పొగమంచు తెరలవలె నా సందేహములు పటాపంచలయినవి. ప్రభూ! నీ అమృతగాన విన్యాసముచే ఆశీస్సులు నాశిరస్సున కురిపించుము- మహానదీ! నీవెట్లు నీలక్ష్యమును చేరుచున్నావు.

రామదాసు

ఇంద్రయానానదీమతల్లీ!
పరుగులువెట్టి, మేటిపరవళ్లను దొక్కుచువచ్చి, శైల గ
హ్వారముల క్రిందుగా నొరసిపారుచునుంటివి బల్ సుడుల్ సుడుల్
దిరిగి అరణ్యసీమలను దేశము లన్నిటిదాటిదాటి ఎ
ట్లరిగెదవమ్మ! నీదుడుకు యాత్రకు గమ్యమదెద్ది తెల్పుమా?

భారతీ తీర్థ

మహాభాగా! సత్యసంకల్పులగు తమవచనాను సారము ఈనది యేనాకు మార్గము చూపినది. తాము శివాజీమహారాజు గురువులు శ్రీరామదాసస్వామి ప్రభువులుగా గన్పించుచున్నారు.

రామదాసు

వత్సా! నిన్ను భగవానుడనుగ్రహించినాడు.

భారతీ తీర్థ

కృతార్థుడను. ఈనదియేనాకు గురూపదేశ మొనర్చినది. నేను అకుంఠితస్థైర్యముతో పురుషకార మొనర్చి నాగమ్యమును చేరెదను- శివాజీ కొలువుకూటమున కేగి, ధర్మరాజ్యసాధనిర్మాణమున నేను ఒక కర్మకారుడ నయ్యెదను-

రామదాసు

వత్సా! పురుషకారమును నెరపి, చరితార్థుడవుగమ్ము!

భారతీ తీర్థ

శరణమురామదాస మునిసత్తము దివ్యపదాబ్జసీత; సం
సరణమహార్ణవక్షుభిత సంగతతుంగతరంగ భంగ సం
తరణవిధానగానపరతత్వరసామృతభక్తి; సత్యసుం
దరశివయోగ ధారణ సనాతనధర్మముముక్తిమార్గముక్.

సేవకుడు

:ప్రవేశించి: శ్రీ శ్రీ శ్రీ శివాజీ ప్రభువర్యులు ఈ లేఖ తమకు సమర్పింపమని పంపినారు.

రామదాసు

వత్సా! భారతీ చదువుము.

భారతీ తీర్థ

శ్రీశ్రీశ్రీ శ్రీమాక్ పూజ్యశ్రీ భగవాన్ సమర్థరామదాస స్వామిగురుదేవుల చరణసాన్నిధ్యమునకు. శివాజీ సమస్కారములు- దేవర ఆశీర్వచనప్రభావముచే మరాఠ బాహువులను విజయలక్ష్మి వరించినది.

శిష్యుడు. శివ.

: తెర :

# ★ తృతీయరంగము ★

ఆగ్రానగరము : భానోజీసౌధము : చిత్రాసనము.

**జయశ్రీ** — : వీణవాయించుచుండును :

: బాలాజీ ప్రవేశము :

నిండుజాబిల్లి పండువెన్నెలలనీన
బిందుమకరంద సందోహతుందిలమ్ము
మొగ్గ చెంగల్వ చిన్నారి మోము నెత్తి
అరయుచున్నది నీకై భ్రమరకిశోర!

: బాలాజీని కీగంటజూచి, లేచి, : స్వాగతము!

బాలాజీ

ఈవీణపలుకునది సంగీతమా? కవిత్వమా?

జయశ్రీ

మీకు-ఏది-ఎక్కువగారుచించును.

భారతీ తీర్థ

నాకు సంగీతములో కవిత; కవితలో సంగీతము రుచించును.

జయశ్రీ

ఓహో! లలితకళలలో ప్రత్యేకముగా మీకు అభిరుచి లేక అభిమానము లేక అభినివేశము ఉన్న కళ?

బాలాజీ

చిత్రకళలో దేవుని దర్శించెదను. సంగీతములో విందును కవితలో అనుభవించెదను- నిన్న, చిత్రమందిరములో నీ "నందన

నవనమును ” చూచినాను. (వేలాడు ఆచిత్రఫలకములో ఉద్యాన వనమే ఊగులాడుచున్నట్లు అనిపించినది.

జయశ్రీ

ఇప్పుడే యింకొక చిత్రమును వ్రాయుచున్నాను.

బాలాజీ

ఊరికే, వట్టిమాటలుచెప్పి, ఊరించిన ప్రయోజనమేమున్నది? ఆచిత్రమును చూపరాదా?

జయశ్రీ

ఇదిగో! : ఒకబొమ్మపై బంగారుపిచ్చుకకూర్చొనిన చిత్రమును అందించును:

బాలాజీ

:మౌనము: చూచుచుండును:

జయశ్రీ

ఏమి? మాట్లాడుటలేదు. బంగారుపిచ్చుకకు బొమ్మకు అంగాంగీభావము కుదురలేదా?

బాలాజీ

అబ్బే—అదిగాదు!

జయశ్రీ

ఏమిటికీ ఆతటపటాయింపు? లోటేమైనకనిపెట్టినారా?

బాలాజీ

ఈబంగారుపిచ్చుకను-ఇంద్రధనుస్సు వన్నెచిన్నెలతో-ఒంటరిగా ఏకాకిగా చిత్రించినావు. పిట్టలుఎప్పుడు జతవిడువవు. ప్రక్కను మరో పిచ్చుకను చిత్రించిన-ఆపక్షులు-జంటగా హాయిగా-మధుర సాహచర్యములో నందనవనములో కాలముగడుపగలవు.

జయశ్రీ

ఇదియేనా మీదీర్ఘాలోచన

బాలాజీ

చూడు! జయా! ఒంటరిగా-ప్రవాసిగా – ఆపిట్టను అట్లుంచుట నీమెడను ఎంతపాపముచుట్టుకొను ననుకొనుచున్నావు!! ఏమి! చెప్పు జయా! నీకుకూడ అట్లుతోచుట లేదా?

జయశ్రీ

ఈచిత్రము ఇంకను పూర్తికా లేదు.

బాలాజీ

ఓహో! ఎప్పుడు పూర్తిచేయ దలచుకొన్నావు?

జయశ్రీ

అది నాయిష్టములో లేదుగదా! రసజ్ఞులకు ఆమాత్రము తెలియదా?

బాలాజీ

పోనీ! వీణనయిన వాయించు. మాటలలోదించి పాటమాని వేసినావు. నీవీణాగానమునకు నాచెవులు నోచుకొనలేదా!

జయశ్రీ

ఇదివరకు చాలసారులు విన్నారుగదా? విసుగెత్తలేదా!

బాలాజీ

ఎప్పటి కప్పుడు నవ్యాతి నవ్యముగనే కన్పించును. ఇదికళలో ఉన్న ఇంద్రజాలము.

జయశ్రీ

నిత్యనూతనమైన కళానందము కావలయు ననిన, మీసైనిక శిక్షణము పూర్తి అయిన తరువాత- మహారాష్ట్ర మహారణ్యములలో కొండలోయలలో లభించును కాబోలు!

బాలాజీ

మరచిపోయినాను. సైనిక శిక్షణపూర్తి అయినది. రేపోమాపో మహారాష్ట్రమునకు పోవలెను.

జయశ్రీ

ఇంక ఇక్కడ పనేమిలేదా? రసజ్ఞశేఖరా!

ఈయమునాతరంగిణిని ఈరమణీయలతా నికుంజమున్—
ఈయెలమావి గున్నలను ఈపువుటీరములందు సంజకెం
జాయలసందులన్ చిలిపి నవ్వులఉయ్యెలలూగుచున్న యీ
ప్రాయపు లేగులాబినెడ బాయగ నీకు మనస్కరించునా?

బాలాజీ

నిజమే- కాని- మనస్కరించుట కేమున్నది?

జయశ్రీ

ఏమీలేదా?— కొన్నికోరికలు మనసులో దాగుడుమూత లాడుటలేదా? అబద్ధమాడవద్దు.

బాలాజీ

అసలువచ్చినపని యైనది. ఆశలకు అంతేమి? సూర్యోదయ మైనతరువాత నక్షత్రములు ఆకాశగర్భములో అణగిపోవును.

జయశ్రీ

అయిన- ఈచిత్రలేఖనములు సంగీతములు ఎందుకు? మహా

రాష్ట్రమునకేపోయి- ఆ ఆనందమును

బాలాజీ

నీవుకూడ ఆ ఆనందమొందవచ్చును. పెరిగినది ఆగ్రానగరమైనను నీవు పుట్టినది మహారాష్ట్రమేగదా? ఆనదీపరిసరములు సాగరతీరములు కొండలోయలు చిత్రకారుని కలలకు మాతృకలు. నిసర్గరమణీయములు.

జయశ్రీ

అది నాయిష్టములో లేదుగదా! మానాన్నగారు పాదుషా కొలువులో ఉన్నారు. కావున నేనును ఆగ్రాలో ఉండవలసివచ్చినది.

బాలాజీ

సరే! మీనాన్నగారేరీ? నేనువారియొద్ద శలవుతీసికొనుటకు వచ్చినాను.

జయశ్రీ

అయిన- ఇక - మీమహారాష్ట్రప్రయాణము నిశ్చయమన్న మాటే!

బాలాజీ

ఏమీ? నేను మహారాష్ట్రమునకు వెళ్లుటనీకు ఇష్టములేదా?

జయశ్రీ

ఇష్టములేనిచో మానివేసెదరా?

బాలాజీ

బాగున్నది- ఊరికే నీహృదయము తెలిసికొనుటకు అడిగినాను

జయశ్రీ

ఓహో! మాహృదయమంత చవుకగా కన్పించుచున్నది కాబోలు!

బాలాజీ

కలుకు యుద్ధభటునితో కవితమాట్లాడిన ప్రయోజనములేదు. ముక్కకు ముక్క తెగవేయుమోటు పద్ధతికి అలవాటుపడినమాకు నాగరకవ్యంగ్యవివరణము తెలియదు.

జయశ్రీ

మనకు పరిచయముకలిపిన ప్రథమప్రభాతము నాకన్నులకట్టినట్లున్నది — ఆకదంబవృక్షముక్రింద వెలుగునీడలు తాండవించుచున్న ముఖమండలములోనుండి చిరునవ్వులుచిందుచున్నకన్నులు నన్ను పలుకరించినవి

బాలాజీ

అవును! జ్ఞాపకమున్నది. ప్రభాతరోచిస్సులలో నాట్యమాడు ఉషస్సుందరివలె ఆసంపంగి లతదగ్గర మేలిముసుగు సవరించుకొనుచు నిల్చినావు.

క్రొంజిగురాకు సందులను కోకిలముల్ కమనీయగీతికా
మంజుల మంజుగానముల మామిడికొమ్మలనెక్క; మల్లికా
కుంజకటీరమందు జడకుచ్చులు పయ్యెదపైనటింప, పు
ష్పాంజలి బట్టినాహృదయమందున నిల్చితివీవు సుందరీ!

జయశ్రీ

ఆనాడు ఆనందపులకితమైన హృదయమునేడు ఆశ్చర్యచకితమగుచున్నది.

బాలాజీ

జయా! నేను నీకు నచ్చజెప్పలేను. నాజీవితపరమార్థము వేరు. మహారాష్ట్రము నాకొఱకు ఎదురుచూచుచున్నది. నీవు నిష్ఠురముగా

మాట్లాడుచున్నావు. వీరధర్మము-

జయశ్రీ

వీరధర్మము మిక్కిలి సుకుమారము కాబోలు.

బాలాజీ

నీకు నేను సమాధానము చెప్పలేను- మీనాన్నగారేరీ?

జయశ్రీ

ఇంటిలో లేరు-

బాలాజీ

సరే- శలవు. ఇంకొకసారి వచ్చెదను.

జయశ్రీ

ఎందుకు? మానాన్నగారు వచ్చువేళ అయినది.

బాలాజీ

అయిన- జయా- ఒకపాటపాడు! ఎంతకాలమునకు తిరిగి నీపాట వినపడునో!

జయశ్రీ

అమ్మయ్యబాబో!

బాలాజీ

ఇకమీదయు పాటపాడుటకేనా?

జయశ్రీ

నామనస్సు బాగాలేదు.

బాలాజీ

పాడు జయా! ఒకవేళ నేనుమహారాష్ట్రమున చూరముగా

నుండుట తటస్థించినను, నాచెవిలో నీమధురగానము తరంగించుచునే యుండును.

జయశ్రీ

మబ్బు సందులలోన
మాయమై పోయేవు
ఓ చందురూడా!
మాటవినిపోవోయి
ఓ సుందరూడా!
చల్లనా నీమోము చాటుగా నుంచేను
చింతతో లోకాలు చీకటైపోయేను
మబ్బుసందులలో॥

: భానోజీ ప్రవేశము :

భానోజీ

ఓహో! బాలాజీ! స్వాగతము! ఎప్పుడు రాక?

బాలాజీ

నమస్కారములు.

భానోజీ

శీఘ్రమే వివాహప్రాప్తిరస్తు! నీసైనిక శిక్షణపూర్తి అయినదని విన్నాను- ధన్యవాదాలు.

బాలాజీ

ఆశీస్సులుగా గైకొనుచున్నాను. తమయొద్ద వీడ్కోలు గైకొను

టకే వచ్చినాను. రేపుబయలుదేరి మహారాష్ట్రమునకు వెళ్ళ సంకల్పము.

భానోజీ

సరే; కూర్చొనుము. మాట్లాడుకొనవచ్చును.

బాలాజీ

ఇంతవరకు తమరు నాయందు అవ్యాజముగ చూపిన ప్రేమాభిమానములకు కృతజ్ఞుడను. జాత్యభిమానమును పురస్కరించుకొని తమరు నాకు సాయముచేసి యుండనిచో సామ్రాజ్యసైనికశిక్షాగారములో నాకు స్థానమే లభించియుండెడిదికాదు.

భానోజీ

యువకుడా! జరిగినదానికే కృతజ్ఞత చూపనక్కరలేదు. ఈ మధ్య అలంఘీరు పాదుషా నాకుసందర్శనము అనుగ్రహించినప్పుడు ప్రసంగమున నీవిషయముకూడ ముచ్చటించినాము. నీకు సైనికశాఖలో ఉన్నతపదవి లభింపగలదు.- మరచిపోయినాను! ఏమది!

బాలాజీ

ఏమున్నది?

భానోజీ

ఆ! ఆనాడు రంజాన్ పోటీపరీక్షలలో నీవుచూపిన కౌశలము పాదుషావారు మరచిపోలేదు. ఇప్పుడే మహారాష్ట్రమునకు పోవుట అంత అత్యవసరమా?

జయశ్రీ

శిక్షణ అయిపోయినదిగా- ఇంక ఆగ్రాలో ఎందుకు? ఎక్కడ కాలము వృథాగా బుచ్చవలెనో అనిఆలోచించుచున్నట్లున్నది

భానోజీ

వెఱ్ఱితల్లీ! ఇక్కడ మనమందరము లేమా? బాలాజీ మనకత్తులో కలసినవాడేగదా! బాలాజీ- పోనీ! వెళ్లివెంటనే తిరిగివచ్చెదవా? మహారాష్ట్రమునకు ప్రస్తుతస్థితిలో మనయువకులు వెళ్ళుట అంత మంచిదిగాదు.

బాలాజీ

ఏమి? ' జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసి ' అని పెద్దల ప్రవచనము. మాతృభూమిని చూడవలెనని కోరికలో తప్పేమి?

భానోజీ

అబ్బాయీ! అదిగాదు. శివాజీపేరు విన్నావుకదా?

బాలాజీ

వినని వారెవరు?

భానోజీ

ఆ! అవును! విననివారెవరు? ఆశివాజీకి ఒకబైరాగిరాముడు గురువు. శివాజీకి పూనిన దురాశాపిశాచమును తృప్తిచేయుటకు ఆక పటమాంత్రికుడొక పాతాళహోమమును ప్రారంభించినాడు. ఆహోమ ధూమ గంధమును పీల్చిన యేయువకుడైనను, యజ్ఞపశువై స్వచ్ఛం దముగ శలభమువలె అగ్నికుండమునకు ఆహుతి కావలసినదే లేదా! శనిగ్రహముచుట్టుతిరుగు ఉపగ్రహములవలెనదాపరిభ్రమింపవలసినదే!

బాలాజీ

చక్కగా ఊహించుచున్నారు!

భానోజీ

విను! ఇంతేకాదు. ఉద్రేకస్వభావులగు యువకులకు స్వాతంత్ర్యోదయము, జగద్విమోచనము- సత్యసంస్థాపన, ధర్మసంరక్షణ అను పేరులుపెట్టి ఆచరణసాధ్యములుగాని ఆశయములపై ఉసిగొల్పుదురు.

బాలాజీ

ఉసిగొల్పుటకు యువకులు వేటకుక్క లనుకున్నారా? అహో శయా! విజ్ఞానమంతయు వృద్ధులే గుత్తగొన్నారా?

భానోజీ

నాయనా! బాగుగా చెప్పినావు, నాకునచ్చినావు, వారిదుర్బోధలకు లొంగవన్నమాటే. అటువంటి గట్టిగుండెకాయ యువకులందరకు కావలెను. వారికి నీవులొంగిపోవు. ఆవిషయమునాకు తెలియును. ఎందులకైనను మంచిదని నీచెవినివేయుచున్నాను.

బాలాజీ

నేను క్రొత్తగా తెలిసికొనవలసిన దేదియు మీరు శలవివ్వలేదే?

భానోజీ

ఓహో! హో!! బాలాజీ! నీవు కుశాగ్రబుద్ధివి. దీనినంతయు నీవిదివరకే గ్రహించినావన్నమాట. కానీ! ఇటుచూడు! మనకు ఎంత

గట్టిగుండెకాయ ఉన్నను వారిదగ్గరకే పోగూడదు. వారు మంత్ర ద్రష్టలు.

బాలాజీ

మంత్రద్రష్టలేగాదు! మహానుభావులుగూడ, పెద్దలనోట విన రానిమాటలు విని సహింపవలసి వచ్చినది.

భానోజీ

ఆః ఆః ఆః ఎవరు మాట్లాడుచున్నది?

బాలాజీ

ఎవడు క్షీణించిపోయిన క్షత్రియ జాతికి నవనవోన్మేషంబు గల్పించెనో, యెవడు సూత్రధారిగ హైందవలక్ష్మి దక్షిణాపథరాజ్య రంగమున పునఃప్రవేశముగాంచి నర్తించుచున్నదో యెవనిబాహు ముడిపాటునుగాంచినంత, భరత ఖండార్థముతల్లడిల్లునో ఆనవ్యభారత నిర్మాత కారణజన్ముడునైన శ్రీ శివాజీమహారాజునే మీరిట్లు దూషించుచున్నారు! ఆస్వార్థత్యాగి, తనరాజ్యసర్వస్వమును శ్రీభగవాన్ పూజ్యశ్రీ సమర్థరామదాసస్వామివారి చరణారవిందముల దారవోసెనని వినలేదా? ఇదిమరాశయేనా?

భానోజీ

పిచ్చివాడా! అది రాజకీయ చతురంగక్రీడలో మొట్టమొదటి మూడుఎత్తులలో మొట్టమొదటిఎత్తు. ధర్మదేవత పేరు చెప్పకపోయిన నీబోటి వెఱ్ఱులు ఎవరు శివాజీ సొంతచక్రవర్తిత్వమునకు ప్రాణములను బలియిత్తురోయీ!

బాలాజీ

దుర్మేధ ఎట్టిపవిత్ర సంకల్పములకైన అపార్థములు గల్పింప గలదు. ముల్లోకముల సార్వభౌమత్వమైనను ఆమహాపురుషుని దేశ సేవకు ప్రతిఫలముకాజాలదు.

భానోజీ

యువకుడా! నీ పురోభివృద్ధికై ఎన్నో సంకల్పించుకొన్నాను. నిన్ను చూచినదిమొదలు నీ లలిత మర్యాదలు వాగ్విన్యాసము నన్నా కర్షించినవి. నాయేకైక పుత్రిక జయశ్రీ నొకకంట, నిన్నుమఱొక కంటజూచి సంతోషింపదలచినాను. కాని నాకలలు తెల్లవారిపోయి నవి- యువకుడా! నీకింకొక అవకాశమిచ్చుచున్నాను. ఇంతవరకు వెలిపుచ్చిన ఆశయములన్నియు నీనిశ్చితాభిప్రాయములేనా?

బాలాజీ

మనసులో ఒకటి - పైకిమరియొకటిచెప్పుట నాపుట్టుకకు,పుట్టిన భూమికి, ధరించిన కత్తికి అవమానము.

భానోజీ

తొండముదిరి ఊసరవెల్లి అయినది, కాదు! కాదు! మోసము! మోసము! యువకుడా! నీవు నాప్రశ్నలకు ఉత్తరమొసగ వలసిన బాధ్యత వహించి యున్నావు. — వంది మాగధుల కన్న మిన్నగా శివాజీ రామదాసుల బిరుదావళులు నీకు కరతలామలకములై యున్నవి. తల్లిదండ్రులులేని మరాఠ కుమారుడనని జెప్పి, నాజవాబుదారీపై సామ్రాజ్యశిక్షణాగారములో ప్రవేశించినావు. శివాజీ పక్షమున వచ్చిన ప్రచ్ఛన్న వేషధారివి కావుగదా! ఏమందువు?

బాలాజీ

ఏమందును? ఏమియు అనను.

భానోజీ

మోసము- భానోజియే మోసగింపబడినాడు- మోసము-

జయశ్రీ

నాన్నగారూ! నాన్నగారూ!

భానోజీ

ఏమిటి తల్లీ?

జయశ్రీ

నాన్నగారూ!

భానోజీ

ఏమిటితల్లీ! రుద్ధకంఠవై మాట్లాడలేకున్నావు! శివాజీరాజనీతి, రామదాసు కుమంత్రిబలము ఆగ్రారాజధాని సౌధాగ్రములలోని తరుణీహృదయములలోనికికూడ పాకుచున్నదే!

: నిష్క్రమణము :

బాలాజీ

జయా! యువకులు నిజముగా ఉద్రేకస్వభావులే- వీరధర్మము యథార్థముగ నిష్ఠురమే. జయా! నన్ను మరచిపొమ్ము!

నీ నయనద్వయీధవళ నీరజకోమల మందహాసరే
ఖానవసాంధ్యశోభలను కమ్మని స్వప్నములల్లుకొంటి ఆ
గ్రానగరమ్మునన్; పురుషకారము వీడగరాదునాకు, మా
తృణముదీర్పు దీక్షనుధరించితి రామమునీంద్రు సన్నిధిన్.

శలవు!

భానోజీ

: ప్రవేశించి : ఆగుము- యువకుడా! ఆగుము!

: ఇద్దరు భటులు ప్రవేశింతురు :

బాలాజీ

: వెనుదిరిగి : ఎందుకు?

భానోజీ

నీప్రవర్తన శంకాస్పదము. యథార్థము తెలిసినగాని నిన్ను వదలిపెట్టుటకు వీలు లేదు-

బాలాజీ

: కత్తిదూసి : ఏమి? ఈభటులానన్ను బంధింపగలవారు. వీరధర్మము భారతభూమిలో నశింపలేదు-

కత్తి చేదండ అండమై హత్తియుండ
ఎదురనిలుచు మహాత్మాయువు లెవ్వరైన
రండు; పిరికిపందలుగ పోకుండిరేని
కాంచెదరు మరాఠ కుమారు కత్తిపదను.

:తెర:



# ★ చతుర్థరంగము. ★

ఒక స్కంధావారము.

మరాఠ సేనాపతులు : మంత్రాంగ పీఠములు :

: శివాజీ ప్రవేశము :

సేనాపతులు

రామ్ రామ్

శివాజీ

రామ్ రామ్. సేనాపతులారా! మహారాష్ట్ర రాజ్యమునకు అపూర్వ విషమ సమస్యయొకటైనది. మరాఠకుమారులకు మరల అగ్నిపరీక్ష ఆరంభమైనది. ఇదివరలో పూనామిట్టడిలో ఇరువదివేల సైన్యము నెదిరించి మీ శక్తియుక్తులు జయమునుచేకూర్చి మరాఠ కీర్తిని దిగంతవిశ్రాంత మొనర్చినవి. అప్పుడుశక్తికన్నయుక్తి, యుక్తికన్న భవానీభక్తియే మనకు తోడ్పడినవి. కాని స్థితిగతులుమారినవి; ఇప్పుడు

సేనకునాయకుండు జయసింహుడు; నమ్మినబంటు లేనికా
గానిగరానమేటి మొనగాడు శతాధిక ఘోరయుద్ధ సం
ధాన విశారదుండు పగదాల్చి, అఖండబల ప్రచండుడై
పూనెను దండయాత్ర పశిపోయిన కోటల నుద్ధరింపగన్.

ప్రస్తుత కర్తవ్యమునుగూర్చి మీ మీ అభిప్రాయములు తెలుప గోరుచున్నాను.

బాలాజీ

జయసింగ్ మహావీరుడు. షాజహాన్ పాదుషావారి కాలమునుండి దేశదేశములలో అఖండవిజయ పరంపరలను సాధించి నేడు వెంగలుసర్వసేనాధిపత్యము వహించినాడు. ఆతడింతవరకు అపజయమను మాట యెరుంగడు. మొగల్ సేనాసంఖ్యాబలము అపరిమితము.

బాజీ

పూనాలో పాదుషా మేనమామను సంఖ్యాబలముచే కాదుగదా మనము ఎదిరించినది! ఈసారి జయసింగ్ వచ్చినాడు. సేనాభటసంఖ్యాతారతమ్యములబట్టి చూచిన, ప్రస్తుతము మొగల్ సామ్రాజ్యసర్వసేనాబలముల నెదిరించుట దుర్ఘటమేకాని, గత్యంతరమేమైన కలదా?

శివాజీ

ఆవిషయమే ప్రస్తుతచర్చనీయాంశము.

తానాజీ

ప్రభూ! కేవలము మనుష్యబలముచే మొగలుల గెల్చుటకల్ల. భవానీపై భారము వైచి పోరాడుదము.

బాజీ

జయము అపజయము అనునది ప్రస్తుత సమస్యయేగాదు.

బాలాజీ

జయము కొఱకైగాక ఇక యుద్ధమొనర్చుటెందుకు?

బాజీ

అపజయము వచ్చునని యుద్ధమును మానివేయుదువా? బాలాజీ! ఆత్మగౌరవ సంరక్షణార్థము అపజయమునకు జంకక ఆత్మార్పణపూర్వకముగ యుద్ధయజ్ఞమును చేయవలసిరాదా?

శివాజీ

ఆస్థితి ప్రస్తుతము తటస్థించినదా? అనునది మన మీమాంస.

తానాజీ

యుద్ధమును చేయకున్న విరోధిసైన్యములు అప్రతిహతముగ మరాఠరాజ్యమును దోచుకొనును.

బాజీ

ప్రజలను రక్షించుట మనకర్తవ్యము.

బాలాజీ

మహారాజా! నిర్విరోధముగ వదలినవారు మాయంతవారు లేరని ప్రళయకాలానలజ్వాలవలె విజృంభింతురు.

భారతీతీర్థ

: ప్రవేశించి : రామ్ రామ్.

సేనాపతులు

రామ్ రామ్

భారతీతీర్థ

మహారాజా! జయసింగ్ నిన్నరాత్రి బీజపూరు సుల్తానువారినిగూడ మనపైకి లేవదీసినాడు ఇప్పుడే వేగులవలన ఈవార్త వచ్చినది.

శివాజీ

జయసింగ్ వీరుడేకాదు. రాజనీతిజ్ఞుడుకూడ.

భారతీతీర్థ

జయసింగ్ సేనలు రాత్రి నాలుగుక్రోసుల దూరములో విడిసినవి. దుర్గముపై నెత్తివచ్చు సన్నాహములో నున్నారు.

శివాజీ

అటు బీజపురీసైన్యముకదలినదా?

భారతీతీర్థ

వారును సమర సన్నాహములోనున్నారు. సేనలుకదలినట్లు వార్తరాలేదు. రామ్ రామ్. :నిష్క్రమించును:

శివాజీ

అటుబిజాపురీసైన్యము వచ్చి చేరకమునుపే మొగలుసేనలను ఎదుర్కొనవలెను.

బాజీ

మేము సర్వసంసిద్ధులము.

భారతీతీర్థ

:ప్రవేశించి: మహారాజా! పురద్వారములను మొగలు ముందరి భటులుచుట్టుముట్టినారు. : శతఘ్ని ఘోషలు :

శివాజీ

: ఆలకించి : అవును! యుద్ధారంభమైనది. సమరప్రణాలికను నిర్ణయింపుము

బాజీ

మహారాజా! ప్రణాలిక కూర్పుభారమునీది. నిర్వహించు బాధ్యతమాది.

శివాజీ

మేముదక్షిణ శ్రేణిని నడిపించెదము. బాజీప్రభువు వామపక్షమునకు నాయకత్వము వహించును. బాలాజీ దుర్గద్వారములను సంరక్షించును. తానాజీ నేతాజీ గర్భమును కాచుచుందురు. పింగళ్ జీ తిరోముఖమును కాపాడుచుండును.

బాజి, బాలాజీ

మహాప్రసాదము.

శివాజీ

సహవ్రతులారా! భారతభాగ్య విధాతలారా!

ఇది కేంద్రశిబిరము శ్రీ భారతీ తీర్థులవారు ఆధిపత్యము వహించి ఆజ్ఞాపత్రముల నిచ్చుచుందురు. సమరప్రకారములోని పతనోద్ధారములు ఎప్పటికప్పుడు కేంద్రశిబిరమును చేరవలెను. :రణభేరి:

రుద్రవీణ : కత్తిమూసి. :

తల్లీ! నిన్నుదలంచి ఖడ్గమును చేతన్ బూనితిన్ ధర్మర
క్షోల్లాసాంచిత దీక్షబూని; పటుధైర్యోత్సాహ శౌర్యంబు సం
ధిల్లన్ జేయుము మాదుసేనల భవానీ! శత్రుసంహారిణీ!
ఫుల్లాంభోజదళాయతాక్షీ; కరుణాంభోరాశి; కాత్యాయనీ!
హర హర మహాదేవ్! హరహరమహాదేవ్.

: నిష్క్రమణము :

బాలాజీ

వీరమరాఠసైనికులారా! దుర్గద్వారములవైపు శత్రుసేనలు కన్నెత్తిచూడరాదు. భారతభవితవ్యమును మరాఠకీర్తిని సంరక్షింపుడు.

అమితోత్సాహ పరీతులై మొగలుసైన్యస్కంధముల్ తూర్యరావములఁ జేయుచు చుట్టుముట్టెను పురద్వారంబులఁ దిఙ్నభోంతములఁగప్పె శతఘ్నిఘోషములు; స్కంధావార నిర్ముక్తులై సమరోర్వీస్థలిచేర రండిపుడు కాషాయధ్వజోద్ధారులై.

హర హర మహాదేవ్! : నిష్క్రమింతురు :

బాజీ

మరాఠ వీరకుమారులారా!

భండనభూమిలోన పరిపంథిదళంబుల చీల్చి చెండుటఁ గండరగండలై బిరుదుగాంచిన మేటిమగండ్రు; చండమార్తాండులు మీరలందరు ప్రతాపమునఁ; రణభేరి మ్రోగె; దోర్దండవిలాస మండితపరాక్రములై చనుదెండు పోరికిఁ.

హర హర మహాదేవ్. : నిష్క్రమణము :

భారతీతీర్థ

: ప్రవేశము సైనికునితో :

ఈపత్రము బాల్జీరావునకిమ్ము.

: భా. తీ. సైనికుడు నిష్క్రమించెదరు :

బాజీ

: ప్రవేశించి : వీరమరాఠ కుమారులారా!

సమయము మరుదెంచె తిరిగిమీశక్తిజూప
భరతదేశమందు మరాట బావుటాను

పేరు దెచ్చిన జగదేక వీరులార
కదలిరండిక స్వాతంత్ర్యకదనమునకు

: నిష్క్రమణము :

శివాజీ

: ప్రవేశించి : రామ్ రామ్.

భారతీతీర్థ

రామ్ రామ్ జయము మహారాజులకు.

**శివాజీ**

మహాశయా! వామపార్శ్వము నుండి వార్తలేమైన వచ్చినవా?

**భారతీతీర్థ**

**మహారాజా!** ఇంకను శుభసూచకములు కన్పించుటలేదు. నిముషనిముషమునకు స్థితిగతులు విషమించుచున్నవి.

**శివాజీ**

ఎవరక్కడ?

సైనికుడు

: ప్రవేశించి నమస్కరించును : జయము మహారాజులకు.

శివాజీ

సేనాపతులు బాజీప్రభువు- తానాజీ బాలాజీ-నేతాజీ-ప్రభృతులను తోడ్కొనిరమ్ము. : సైనికుడు నిష్క్రమించును :

**బాజీ**

: ప్రవేశించి: రామ్ రామ్

**శివాజీ**

: రామ్ రామ్: బాజీప్రభూ! వామపార్శ్వమున యుద్ధగతి ఎట్లున్నది?

బాజీ

మహాప్రభూ! ప్రస్తుతము బాలాజీకూడా వామరంగమున పోరాడుచున్నాడు. శతృతంత్రములను ఎఱిగినవాడు. ఆ వీర కుమారుని ప్రోత్సాహబలమే మన సేనల నింతవరకు నిలుపు చున్నది.

కాని—

తురగవ్రాతము కూలిపోయె భటసందోహంబులున్ వ్రచ్చెనె
త్తురుజాలై ప్రవహించె శీర్షులపయిన్ దోర్దండులై వీరులం
దరుయుద్ధంబును వీడనేరరదె వాత్యా క్షోభితంబైనసా
గరమున్ బోలి కలంగె యుద్ధభటసంఘాతమ్ము ఘూర్ణిల్లుచున్

శివాజీ

బాజీప్రభూ!

మా సేనలును డస్సిపోయినవి వృథారక్తపాతమును సహింపలేక సేనలను తిరోముఖమునకు చేర్చినాము ఎదిరిబలమా! అసంఖ్యాకము ఎంతమంది కూలుచున్నను రావణాసురుని శిరసులవలె పునర్భవించు చున్నారు.

జననీ! భవానీ! నీ భక్తులు అసిధారావ్రతమును ఆచరించు చున్నపుడే అగ్నిపరీక్షను ఆరంభించితివా?

తల్లీ! నీయిచ్ఛకు అంతరాయములు లేవు.

జగదీశ్వరా! స్వార్థత్యాగుల కళేబరములపై సాగుచున్న నీ ధర్మరథమార్గము రక్తపంకిలముగదా?

బాజీప్రభూ!

సాహసులై యెదిర్చిమన సైనికులెల్లరు పోరినారు ఘో
రాహవమందు నేడపజయంబు ఘటిల్లెనవార్యమై మొగల్
వాహిని వచ్చిమీదపడె; లాభములేదిక పెన్గులాడి, పూ
ర్ణాహుతిగాక పూర్వము బయల్పడుమార్గముచూడు వీరుడా!

: బాలాజీ తానాజీ నేతాజీ ప్రభృతులు ప్రవేశము :

బాలాజీ

రామ్ రామ్

శివాజీ

రామ్ రామ్

సహావ్రతులారా! ఇంతవరకు జరిగిన సమరప్రకారము మీ కెల్లరకు విదితమే.

సైనికుడు

: ప్రవేశించి : రామ్ రామ్. మహారాజా! తండోప తండములుగా వచ్చి పైబడు మొగల్ సేనాసమూహముల ధాటికి, శతఘ్నుల అగ్నివర్షములకు తాళజాలక మనసేనలు చెల్లాచెదరై తిరోముఖమును బట్టుచున్నవి.

శివాజీ

మీ అభిప్రాయము.

బాజీ

ఇక యుద్ధమువల్ల ప్రయోజనము లేదు. ఉపాయాంతరముననే కార్యము సాధింపవలెను.

శివాజీ

మహాశయా! మీ అభిప్రాయము.

భారతీతీర్థ

మహారాజా! మహావీరులారా! బాజీప్రభువుతో నేను ఏకీభవించుచున్నాను. యుద్ధమువల్ల ప్రయోజనము లేదు.

శివాజీ

అయిన ఉపాయాంతరము?

భారతీతీర్థ

రాజగడము అభేద్యమైన దుర్గము. నేనిదివరలో కోటలో ఆరు మాసములకు సరిపోవు ఆహారపదార్థములను సిద్ధము జేసినాను. ఎట్లయినకోట చేరగలినచో ప్రస్తుత పరాజయమునుండి తప్పించుకొనవచ్చును.

బాజీ

మహాభాగా! మహారాష్ట్రవీరులశత్రులు సాధింపలేని మహాకార్యమును మీబుద్ధిబలముచే సాధించుచున్నారు.

శివాజీ

ఈ యూహ కొనియాడదగినదే. కాని, రెండు క్రోసులదూరములోనున్న రాజగడమును చేరువరకు, శత్రుసైన్యములు మనలను చూచుచు ఊరకుండునా?

భారతీతీర్థ

మనలో- ఎవరో- ఒకరు- కొద్దిపాటి సైన్యముతో లోయను కాచి, ప్రాణముల నర్పించియైనను, యత్కించిత్కాలము శత్రుసైన్యముల నడ్డగించిన- తక్కినవారు సురక్షితముగా కోటచేరవచ్చును

శివాజీ

అవును- సహృదయులారా! మీకందరకు నాధన్యవాదములు. కృతజ్ఞత. నాసేనలను సంరక్షించుట నావిధ్యుక్తధర్మము. నేనీలోయ లోనిల్చి, మృత్యుదేవతనైనను నెదిరించి, శత్రుసేనాతరంగ పరంపరలను యతిక్రమించిత్కాలమైనను ఆపివేసెదను. నిశ్చయముగా ఆపి వేసెదను. మాతాభవానీ తప్పక తోడ్పడగలదు. అంతలో మీరు సురక్షితముగా కోటచేరి, మరాఠకీర్తిని భారత భాగదేయమును కాపాడుడు. శలవు!

బాలాజీ

ఏమహావీరుని భుజస్కంధములపై అశేషభారత ప్రజల ఆశాలతలు ప్రాకుచున్నవో, ఏమహానుభావుని రక్తమోయిన శక్తిరేకొత్తజాతికి నవనవోన్మేషంబు గల్పించెనో, ఏకారణజన్ముడు స్వాతంత్రధారిగా హైందవరాజ్యలక్ష్మి దక్షిణాపథరాజ్యరంగమున పునఃప్రవేశముగాంచి నర్తించుచున్నదో ఆమహావీరుడే నేడు యుద్ధకుండమున కాహుతియైన ఇక మహారాష్ట్రదేశమునకు నాయకుడు, భారతభాగదేయమునకు నియంత ఎవరు? మహారాజే లేకున్న శత్రుసేనలకు నిర్వికల్పమైన జయమేగదా? త్యాగశీలురైన మరాఠకుమారులెందరో యుండ మహారాజే ఆత్మత్యాగమునకు పూనవలెనా? మాతృదేశ సేవాచరణమ్మునకై దీక్షాబద్ధుడై నిల్చిన యీబాలాజీకి ఆశీస్సులతో అనుజ్ఞ నివ్వవేడుచున్నాను.

బాజీ

మహారాజా! బాలాజీ జయాభిలాషి. యువకుడైన యీతడు దుర్గరక్షణలో నుండుటమంచిది. శత్రుతంత్రజ్ఞుడైన బాలాజీభవిష్య

త్కాలముసకుపకరింపగలడు- నేనే లోయలోనిల్చి ఒక్కసైనికుగూడ ఒక్కఅడుగుపెట్టనివ్వను- ఈ మహత్తరకర్తవ్యనిర్వాహణమున జననీ భవానీ నన్నునిమిత్తమాత్రునిగ గైకొన్న చరితార్థుడను.

తానాజీ

మహారాజా! మరాఠవీరమాతకు తానాజీకూడ పుత్రుడే మాతృఋణముదీర్పు ఈసదవకాశము నాకనుగ్రహించి నాజీవితమును తరింపజేయ ప్రార్థన.

బాజీ

తానాజీ! నీవును బాలాజీ నాకంటె చిన్నవారలు. మీవంతు ఇంకనురాలేదు. మహారాజా!

చంచద్ఘోర శతఘ్నిగోళనివహాజ్వాలానలాభీలమై
పంచారించు మొగల్ చమూబలముగెల్వంజాల మెట్టైన యత్
కించిత్కాలము లోయలో నిలిపెదన్ క్షేమంబుగా రక్షణో
దంచద్దాజగడంబుచేరుడిది కర్తవ్యంబు వీరాగ్రణీ!

: శతఘ్నిఘోషములు :

అదిగో! మొగలుసైన్యములు వామరంగమునుగూడ భేదించుకొని వచ్చుచున్నవి. మహారాజా! ఇకజాగుచేయరాదు. మీరు సురక్షితముగా కోటచేరినట్లు నాకెట్లు తెలియగలదు?

శివాజీ

బాజీప్రభూ! వీరపుత్రులనుగన్న మరాఠదేశము నేడువీరమాతగా ప్రజ్వరిల్లినది. సేనలతో మేము కోటచేరి ద్వారములను బంధించుటవరుసగా మూడుశతఘ్నులతో తెలిపెదము. బాజీప్రభూ!

భారతీతీర్థ

భారతభవితవ్యమును మరాఠసేనల మానప్రాణములను నీఅర చేతిలో పెట్టిపోవుచున్నాము.

కావుము వీరుడా భరతఖండము శత్రువునుండి కానిచో
పోవును వీరభారత విభూతియు పుణ్యము పూరుషార్థముల్
కావునమాతృదేశమునకై యొరదీసినకత్తి నేటి యు
ద్ధావని ఎన్నడున్ ముడువనన్న ప్రతిజ్ఞకు ధన్యవాదముల్

: శతఘ్ని రావములు :

బాజీ

: ఒరదీసి పారవైచి : భారత భవితవ్యమునకు పరమాత్ముడే పరమాప్తుడుకాగలడు. మరాఠసేనలకా!

బాజికంఠాన ప్రాణముల్ వరలువరకు
మొగలుసైన్యములెల్ల మీపోవు తెరగు
తేరిచూడజాలవు; కోటచేరినంత
క్షేమమును దెలుపుడు శతఘ్నితయాన!

: శివాజీ ప్రభృతులు నిష్క్రమించెదరు :

: శతఘ్నిరావములు :

హార్దీసు మహాలు సైనికులారా! మీసేనానాయకుడు బాజీప్రభువు ఇదేవచ్చుచున్నాడు. లోయలోనిల్చి శత్రుసైన్యముల నరికట్టి ఒక్కఅడుగైనను ముందునకు పెట్టనీయకుడు. హరహరమహాదేవ్!

సమరక్షోణిని నిల్చిపోరుడు రణోత్సాహంబు దీపింప శౌ
ర్యముతో లోయనుకాచి నిల్చి; మనసైన్యస్కంథముల్ పోయి దు
ర్గములో చేరెడిదాక, శాత్రవచమూకాండమ్ము చెండాడి, రా
జ్యమురక్షించిన కీర్తిగాంచునుడు మీరాచంద్రతారార్కమున్

: నిష్క్రమణము :

: రక్త సిక్తాంగుడైన బాజీ ప్రభువు పునఃప్రవేశము :

:శతఘ్నిరావములు సైనికుడు పడిపోయిన బాజీప్రభునిపట్టుకొనును :

బాజీ

: రెండవ శతఘ్ని : తల్లీ భవానీ! శివాజీ కోటచేరినాడు. మూడవ శతఘ్ని! చరితార్థుడను. నాజీవిత పరమార్థమును నిర్విశేషము నిర్వ ర్తించి... తల్లీ! భవానీ! నన్ను పునర్జన్మములోగూడ భారతీయునిగ సృష్టింపుముతల్లీ!

సైనికుడు

సేనాపతీ! అయ్యో! స్మృతి తప్పినదా? నిన్ను అశ్వముపై ఎట్లయినకోటచేర్చెదను.

: తెర :



# ★ పంచమ రంగము. ★

: రాజగడ దుర్గము :

శివాజీ

జననీ భవానీకృపచే, నిరపాయముగ కోటచేరగలిగినాము-లోయలో చిక్కుకొనిన మొగలుసైన్యమును ఈక్షణముననే వెనుక నుండిచేరి సానుద్వారమును బంధింపవలెను.

బాలాజీ

ప్రభూ! నేనిదే నాసేనలతో శత్రుతిరోభాగమును చేరెదను. ఇకవారిని ముప్పతిప్పలుపెట్టి మూడు కొండలు త్రిప్పవచ్చును-తానాజీ కొండపైచేరి పర్వతపాషాణశిలలను వారిపైకి దొర్లించవచ్చును-

తానాజీ

ఆజ్ఞ- పోవుచున్నాము- : ఇద్దరు నిష్క్రమించెదరు :

సైనికుడు

: ప్రవేశించి : మహారాజా! బాజీప్రభువు మొగలుసేనాసమితిని లోయలో అడ్డగించి భీకరసంగ్రామములో అకుంఠిత స్థైర్యముతో నిల్చినాడు. ఈవీరపురుషుని పరివేష్టించిన పరాక్రమజ్వాలాచక్రము వైరిసేనానివహముల కన్నులకు మిరుమిట్లుగొల్పినది. ఒక్క అడుగైనను శత్రువులు ముందునకు పెట్టలేకపోయిరి. శరీరమున గాటమైన గాయములు తగిలి రక్తము జాలైస్రవించుచున్నను ఆవీరపురుషుడు యుద్ధమును మానలేదు. మూడవ శతఘ్ని మోత్రకు...

శివాజీ

ఏమైనది?

సైనికుడు

ఆమహావీరుడు అంపశయ్యపైబడిన భీష్మునివలె మూర్ఛితుడై నాడు- నేనుబాజీ ప్రభువును శిబిరమునకు మోసికొని వచ్చుచుండగా

శివాజీ

ఏమైనది! ఇంతకుబాజీప్రభువు— : కత్తిదూసి పోబోవును :

సైనికుడు

మహారాజా! అంత్యసందేశమడిగినాను!

శివాజీ

: ఆగి : ఏమిచెప్పెను?

సైనికుడు

నిర్వర్తింపవలసిన ధర్మమును నిర్విశేషముగా నిర్వహించి- మహాప్రభూ- బాజీప్రభువుల స్తమించినాడు-

శివాజీ

వాడె మిత్రుడు మాకుశిక్షకుడు సేనానాయకుం డాతడే
కైకారాధ్యుడు వీరలోకమునకున్ ప్రాణంబులర్పించుచున్
నాకున్ మీకు యశంబుగూర్చచనియెన్ మార్తాండతేజస్వి; స్వ
ర్లోకంబందున నిల్చెనేడు విజయారూఢావలోకంబులన్.

ఎవనిపేరు విరోధిసేనావేదండయూథములకు సింహస్వప్న మో ఎవడు వైరిసేనాసముద్రోత్తుంగతరంగపరంపరలకు చెలియలి

కట్టమై నిలిచెనో, ఎవని బాహుబలమున మహారాష్ట్రరాజ్యమునకు చరిత్రాత్మకమగు విజయము సిద్ధించినదో- ఎవనిఆత్మబలిదానము వలన దక్షిణాపథమంతయు అన్యాక్రాంతము గాకుండ నిల్చియున్నదో- ఎవనివీరమరణకథాకథనము విని మూడు కాలములును రోమాంచమును వహించునో ఆ యేకైక వీరమరాఠకుమారవాళి దిగంత విశ్రాంతకీర్తి బాజీప్రభువు ధర్మమునకై హృదయశోణితమును దానము చేసి మృత్యుదేవతను సయితము ఎదుర్కొని కీర్తిశేషుడై జ్యోతిర్లోకమున నిల్చినాడు.

భారతీతీర్థ

మహారాజా! పలువురనుజంపి, చచ్చియు విజయము సాధించి యిచ్చిన క్షత్రియవీరకుమారుని కై ప్రాకృతులవలె దుఃఖించుట పాడిగాదు-

బాజీప్రభువు నిర్యాణమువలన భారతమాత ఒకవీరపుత్రుని మరాఠరాజ్యమొక సేనానాయకుని మనమొక సహావ్రతుని గోల్పోవుట తటస్థించినది. కాని!-

భారతమాతకు గౌరవము! మరాఠరాజ్యమునకు విజయము! మనకొక ఆదర్శము లభించినది! ఈమృతజీవి పరాక్రమచరిత్ర స్వార్థత్యాగముయొక్క దివ్యసంకీర్తనమై ఆచంద్రార్కము భారతవీరులకు ధ్రువాదర్శమై వెలయగలదు! బాజీప్రభువు పవిత్రాత్మకు మాతా భవానీ శాంతిననుగ్రహించుగాక!

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.

ప్రతీహారి

: ప్రవేశము : మహారాజా! లోయలో చిక్కుకొనిన మొగలులు - శ్వేతపతాకముతో రాయబారిని పంపినారు.

శివాజీ

రేపు వారిని పురందరులో చూచెదము- అక్కడకురమ్మనుము!

: ప్రతీహారి నిష్క్రమణము :

మహాశయా! బాజీకుటుంబమునకు స్వయముగా మాసానుభూతి తెలుపవలెను. బాజీ చిన్నకుమారుడు శంభాజీతోపాటు పాంచహాజారీస్థానమలంకరించుగాక! వీరమర్యాదలతో ఈమహాపురుషుని కళేబరమునకు దహన సంస్కారములు జరుపవలెను-

ఈమహావీరుని పవిత్రస్మృతికి సర్వసైన్యములతో మరాఠరాజ్యము ప్రణామగౌరవములతో వీరపూజచేయవలెను.

: తెర :



# షష్ఠ రంగము.

## ★ మొగల్ దర్బారు. ★

: రాజా రాంసింగ్ శివాజీకి మార్గదర్శకుడై తోడ్కొనివచ్చి పాంచహజారీస్థానమున ఆసీనుని చేయబోవును- :

శివాజీ

: పరికించి : రాజా రాంసింగ్! ఇదియేనా? మాఆసనము?

రామసింగ్

మహారాజా! దర్బారువారేర్పరచినదిదియే-

శివాజీ

ఈ ముందున్న మహావీరులెవరు?

రామసింగ్

మహారాజా! మొగలు సామ్రాజ్యసర్కారువారిచే తమకు శ్రీ శంభాజీకి పాంచహజారీ స్థానమేర్పాటుచేసినారు.

శివాజీ

చిరంజీవి పుట్టుకతోడనే పాంచహజారీ- మా రాజ్యములో బాలాజీ తానాజీ- స్వామీభారతీతీర్థ- ఎందరెందరో పాంచహజారీలు కలరు. మేము మొగల్ దర్బారునకువచ్చుట ఈఅపూర్వ ఆతిథ్యమర్యాదల నందుకొనుటకా? రాంసింగ్. : తిరిగి : రాజా రాంసింగ్! నాడుమాకొలువుకూటములో మీరు పలికిన ప్రతిజ్ఞావాక్యములు జ్ఞాపకము లేవా?

చేసిన ప్రమాణములను రాజపుత్రవీరుడు జయసింహుని పుత్రుడు రాంసింగ్ మీరుసా? పురందర్ సంధిషరతులు- మేము దర్బారునకు రానక్కర లేదుగదా? అయినను శ్రీఅలంఘీరు పాదుషా వారి లేఖ-దర్బారులో- నేడు పాంచహజారీ స్థానము!!!

ముట్టడి మానినామపుడు మోసము; సంధికరాయబారులకా
కట్టడి చేసిపంచి, నయగారపుమాటలతో మరాఠ స
మ్రాట్టును మోసపుచ్చగలరా? రణభేరులబుజ్జగించి జో
కొట్టగచూతు రేల? షరకోటినిముట్టిన నీతికోవిదుల్.

: పాదుషా ప్రవేశము :

వందిమాగధులు

శ్రీ శ్రీ శ్రీ మొగల్ సామ్రాజ్య చక్రవర్తి- అలంఘీర్ పాదుషా ఆతాహై... : ఘంటికా నినాదము :

శివాజీ

అవమానము!!

రామసింగ్

: నమస్కరించి : మహారాజా! నాప్రార్థన మన్నింపుము-

పాదుషా

రాజా, రాంసింగ్.

రామసింగ్

: నమస్కరించి : జహాపనా!

పాదుషా

ఏమది?

### రామసింగ్

వనవిహారమున కలవాటుపడిన మహారాష్ట్ర మృగరాజు నాగరకసభామందిరములో సంచరింపలేదు. మొగలుసామ్రాజ్య పాదుషా విభవప్రవృత్తికి విస్మయాకుల విహ్వల చేతస్కుడైన శివాజీ మహారాజునకు దర్బారు మర్యాదలు...

### పాదుషా

రాజా శివాజీ!

### శివాజీ

జహాపనా! : మూర్ఛితుడగును :

### పాదుషా

రాజా రాంసింగ్

### రామసింగ్

జహాపనా!

### పాదుషా

ఆకల్లోలమేమి?

### రామసింగ్

శ్రీశివాజీ మహారాజు మూర్ఛితుడైనారు. ఇవిగో శివాజీ మహారాజ్ పాదుషాకు సమర్పింపతెచ్చిన రత్నరాసులు.

### పాదుషా

సరేమంచిది- శివాజీరాజావారిని జయపూరుసౌధము చేర్చి వైద్యసహాయముతో కాపాడుడు... ఇంక రాజా శివాజీ దర్బారునకు రానక్కరలేదు- శంభాజీరావచ్చును. అల్లాహో అక్బర్.

: పాదుషా నిష్క్రమణము :

: తెర :

# ★ సప్తమ రంగము ★

: ఆగ్రానగరము : భానోజీ సౌధము :

: చిత్రాసనముపై ఆసీనయైన జయశ్రీ. మధురిక ప్రక్కనుండును. :

జయశ్రీ

అబ్బా! చిననాటినుండి చెలికారమును నెరపుచున్న ఈవీణకు కూడ నాపై అనుగ్రహముతప్పుచున్నది. తంత్రులుఎంత సవరించుచున్నను, అపశ్రుతులీనుచున్నవి. : మరల సవరించి : వీణనుపలికించుటకే భయమగుచున్నది.

తలపులు త్రవ్వి; గానకవితారసభావతరంగిణీతటీ
విలసితనందనోపవన భృంగవిలుబ్ధమరంద సారమౌ
వలపులతీపిరేపి వలవంతల్రదోసి తొలంగు స్వప్నముల్
గిలికి; కలంగజేసి; ఉడికించి, ధ్వనించును వీణనాహృదిన్.

మధురికా! నేనింకపాడలేను!

జారుచున్నది వీణ హస్తములనుండి
పండిరాలెడి హేమంత పత్రసరణి
స్మృతి పరంపరలను రచియించుకొనుచు
బ్రతుకుమంచు వ్రాసెనకట బ్రహ్మనొసట!

భానోజీ

: ప్రవేశించి :- తల్లీ! జయా! నీవు ఎల్లప్పుడు బెంగటిల్లినట్లు కన్పడుచున్నావేమి? తల్లీ! నీకులోటేమి? నాతో చెప్పరాదూ?

జయశ్రీ

: అబ్బే! ఏమీ లేదు! నాన్నగారూ!

భానోజీ

తల్లీ! ఒకశుభవార్త! ముందునీకొక విషయముచెప్పి చెప్పెదను లే!- చూచినావా! ఆ అభాగ్యుడు- బాలాజీ! నేను మొట్టమొదట చెప్పలేదా?

జయశ్రీ

ఏమైనది!

భానోజీ

: వికవికనవ్వి : - ఏమైనది! నవ్యభారతనిర్మాత! భారత భాగ్యవిధాత! కారణజన్ముడు ఏమైనాడు? సింహాము- పెద్దపులి!- ఆగ్రానగరములో- జయపూరుసౌధములో పిల్లిపిల్లవలె పాలు త్రాగు చున్నాడు. నిత్యము పరమాత్మ ధ్యానము. బ్రాహ్మణులకు ఫలప్రదానము.

జయశ్రీ

పాపము! శివాజీ మహారాజు!

భానోజీ

పాపము! లేదు గీపము లేదు. 'బుద్ధికర్మానుసారి' అసలు- ఈ పరాభవము- శివాజీకి కాదు. చిన్నశివాజీ- ఉన్నాడే బాలాజీకి జరుగవలసినది.

జయశ్రీ

మన కెందుకు! బాలజీ ఏమిచేసినాడు-

భానోజీ

ఏమిచేసినాడా! మోసము! ఇంకేమైన ఉన్నదా? మొన్న రాంసింగ్ చెప్పలేదా? రాజ్‌గడ్ యుద్ధములో కనపడినాడని. ఇంకానయము-! ఎందుచేతనో ఈవిషయమాతడు పాదుషాతో చెప్పలేదు!! నా నెత్తిమీదకు వచ్చిపడేడిది. సరే! ఏమున్నది? రాంసింగ్ యువకుడు గదా? తారకమంత్రోపదేశము జరుగుచున్నదట. 'వినాశకాలే విపరీతబుద్ధిః' అన్నారు. అమ్మో!

జయశ్రీ

నాన్నగారూ! ఈగందరగోళము మీ కెందుకు?

భానోజీ

ఎందు కేమున్నది?-.. పాదుషా చండశాసనుడు.
ఈకపటనాటకమంతయు కనిపెట్టినాడన్నమాటే. అందుచేతనే- రాంసింగ్‌తో నన్ను కూడ శివాజీపై నియమించినాడు. నేను ఈసారి చాల జాగ్రత్తగా ఉన్నాను. నేను ఆనాడే గ్రహించినాను-మన కృష్ణాజీచెప్పలేదూ? పురంధరు సంధి షరతులలోనే ఏదో మోసము జరిగినదని.

జయశ్రీ

ఎవరు చెప్పినది?

భానోజీ

మనకృష్ణాజీని ఎరుగవా?

జయశ్రీ

మన అనుచున్నారేమీ?

ఎరుగకేమీ? వట్టిపిరికిపంద. మన మధురిక అతనికన్నమిన్నగా యుద్ధముచేయగలదు.

భానోజీ

ఓహో! ఆడపిల్లలు మగవారివిద్యలు నేర్చుకొనుట చాలచిక్కగా నున్నదే! - తల్లీ! నీవు మధురిక ఇంటిదగ్గర నేర్చుకొనిన ఖడ్గచాలనము యుద్ధభూమిలో పనికిరాదమ్మా! అసలు రహస్యము— అందరికన్నబాగుగ గారడీవాడు కత్తితిప్పగలడు! కృష్ణాజీ మంచిబుద్ధిమంతుడు. పాదుషావారికి అతడన్న మంచిఅభిమానము-!

జయశ్రీ

అతని గొడవనాకెందుకు?

భానోజీ

తల్లీ! జయా! మీఅమ్మపోయినదగ్గరనుండి, నిన్నుపెంచి పెద్దదానిని జేసినాను. విద్యాబుద్ధులు గరపినాను- నేనా పెద్దవాడనగుచున్నాను. ఇంకనీవివాహము చేతులార నెరవేర్చి, సంతోషింపగోరుచున్నాను.

జయశ్రీ

నాన్నగారూ!

భానోజీ

ఏమితల్లీ

జయశ్రీ

నాన్నగారూ! నాకువివాహమువద్దు.

భానోజీ

పిచ్చితల్లీ! తొందరపడకు- తిరిగివచ్చెదను. :నిష్క్రమణము:

జయశ్రీ

మధురికా; గోరుచుట్టుపై రోకటిపోటు! చూచితివా, తండ్రి చూచిన విధము బాలాజీచూచిన- చూచుటకైనా? ఏమినటనలు! నయనాగారములు.

వ్రాసినవక్షిన్నైన జతఁగాయగ చూడగలేనటంచు ప
న్యాసనుధామధూక్తినటనమ్ములొనర్చె; యథార్థమౌ క
పాసిమెయైనచో వలపువాహినిలో ఎదురీదునే రసా
భాసమొనర్చి సౌహృదయ వల్లరులన్ తెగద్రెంచునే చెలీ!

మధురిక

జయా! ప్రేమగలవారి తిట్టులోగూడ ఎంతరుచి అందము ఇమిడియుండును!_ అయినా ఒక్కమాట- బాలాజీ మొట్టమొదటినుండి నీకుసూచించుచునే యున్నాడు! ఏమీ ఆతనిదీక్ష! దేశసేవాపరతంత్రత! బాలాజీ ప్రేమించు మహారాష్ట్రమును- మహారాజును మహాశయములను ప్రేమించనిదే బాలాజీని ప్రేమించుటకు వీలులేదు.

జయశ్రీ

పోనీ దేశసేవా పరతంత్రుడై పోయెననుకొందము. ఆపూజలో ఈఅభాగిని మాత్రము ఉదకమై—పుష్పమై—ఉపచరింపకూడదా?

మధురిక

ఇదియా నీ వ్యథ!-దీనికి మీనాన్నగారు సమ్మతించెదరా?

జయశ్రీ

కన్నతల్లి పోయినలోటు కాననీక
పెంచినాడు మాతండ్రి లాలించిబుజ్జ
గించి గారాబముననన్ను క్రిందపెట్ట
కుండ ప్రాణాలు నామీద నుంచుకొనుచు

మధురిక

ఆనాడు అశ్వమును మాతోటదగ్గరనిలిపి పిలిచినాడు. అదే ఆఖరునారి అతనినిచూచుట ఒడిలోనిపువ్వులు బుట్టలోవేసికొని దగ్గరకు వెళ్ళినాను. ఆ ఆర్ద్రహృదయుని కన్నులలో నీళ్ళుగిఱ్ఱున తిరిగినవి. జయశ్రీ అన్నాడో లేదో, అంతలో అశ్వము అది వీరధర్మముకాదని సకిలించినది. మారుమాటాడకుండ మరలిపోయినాడు.

జయశ్రీ

ఎవరో పిల్చుచున్నట్లున్నారు.

మధురిక

నేను వెళ్ళికనుగొని వచ్చుచున్నాను. : నిష్క్రమించును :

జయశ్రీ

: వీణవాయించును - లేవబోవును. : మధురికా!

మధురిక

: ప్రవేశించి : ఎవరోవచ్చినారు.

జయశ్రీ

నాన్నగారు లేరని చెప్పలేదా?

మధురిక.

చెప్పినాను! మిమ్ముల‌ను చూడవలెనను చున్నారు.

జయశ్రీ

ఎవరువారు? ఇప్పుడుమీలు లేదని చెప్ప లేదా?

మధురిక.

ఎవరో విచిత్రపురుషునివలె నున్నారు. నిన్ను చూడవలెనను చున్నాడు-

జయశ్రీ

ఊరుపేరులు తెలియకుండ? పే రేమి?

మధురిక

అడిగినాను! ఆనంద వర్తుడట. త్రివిష్టప దేశవాసియట!

జయశ్రీ

సరే రమ్మను-

: మధురిక నిష్క్రమణము :

: ఆనందవర్తుడు ప్రవేశము :

జయశ్రీ

: చూచి : బాలాజీ! : తలవంచుకొని : స్వాగతము!

బాలాజీ

: ససంభ్రమముగ : కల్యాణీ; మారువేషములోనున్న నన్నెట్లు గుర్తింపగల్గినావు!

జయశ్రీ

మారువేషముకాదు! మరియొక జన్మదాల్చినను గుర్తుపట్టగలను.

బాలాజీ

: నిట్టూర్చి : జన్మజన్మాంతర సౌహృదములను మధురవ్యథలను రేకెత్తించు నీవీణాగానమును తిరిగి ఎంతకాలమునకు ఈమేడక్రిందనుండి వినగల్గినాను!

జయశ్రీ

బహుకాల సందర్శనము! ఆత్మధర్మమును వజ్రసంకల్పముతో నిర్వహించుచున్న రాజ్‌గడ్ వీరునకు అభివందనములు.

బాలాజీ

ధర్మమార్గము బహువిధకంటకశిలానిర్మితము. ఎట్లో ధర్మభ్రంశముగాకుండ శ్రీరామదాసముని కృపావీక్షణమువల్ల తరింపగలుగుచున్నాను- మహారాష్ట్రదేశమంతయు నేడు స్వాతంత్ర్యమహాసమరయజ్ఞవాటిక, దీక్షలోనున్నయువకులు పరచింతలకు తావీయరాదు!

జయశ్రీ

సహధర్మిణి లేని యజ్ఞాధికారము!

బాలాజీ

అన్ని అధికారములు భగవాన్ రామముని గురుదేవుల దివ్యకరుణావీక్షణమువల్లనే సిద్ధింపగలవు!

జయశ్రీ

భక్తిభావతరంగితమైన, వారిమధురగీతికలుకొన్ని విన్నాను. వానిలో అమృతమయ హృదయము తొలుకాడుచున్నదేగాని- కేవల వైరాగ్యశుష్క-ధర్మనిష్ఠుర ......

బాలాజీ

జయా! నేనుమాత్రము వేరుగా చెప్పుచున్నానా?
ప్రేమమయుడు మాగురుడు శ్రీరామహాని
నిత్యమై నిరవధికమై సత్యమైన
ప్రేమనవనీతమును పంచిపెట్టుచుండు
పరమపురుషుని ప్రేమించు భక్తతతికి.

జయశ్రీ

కొంతమందికి భాష. తమఅభిప్రాయములను వెలిబుచ్చుటకు తోడ్పడును-

బాలాజీ

జయా! వ్రతదీక్ష ఇంకనుముగియుయలేదు- మీనాన్నగారుఏరీ?

జయశ్రీ

అమ్మయ్యాబాబో! సమయమునకు జ్ఞాపకముచేసినారు అంతయు మరచిపోయినాను. ఇంకేమైన ఉన్నదా? మిమ్ముల నుచూచిన- దయయుంచివారు వచ్చులోపల వెంటనేవెళ్ళిపో...... వద్దు... ఇంకనువారువచ్చుసమయము కాలేదు-

బాలాజీ

నాకువారితో అత్యవసరమైన పనిఉన్నది--

జయశ్రీ

ఎంతనిర్వికారముగా మాట్లాడుచున్నారు! ఇంకేమైన ఉన్నదా? వారికి కనపడిన ఈరోజుతో-

బాలాజీ

నాకు ఏమీ భయము లేదు- సర్వమునిర్వహింప జననీభవానీయే గలదు.

జయశ్రీ

పట్టినపట్టుకు మీకు విడుపు లేదు- అమ్మో! మహావీరుడా! మహారాష్ట్రమునకు వెంటనే నురలిపోయి ప్రాణములు కాపాడుకొనుడు. దయయుంచి మానాన్న గారికి కనపడవద్దు-

బాలాజీ

జయా! కార్యార్థినై వచ్చినాను! ఉత్తచేతులతో తిరిగి పొమ్మందువా? మీనాన్న గారిసహాయము-

జయశ్రీ

సహాయమా? అసంభవము. అసంభవము. సహాయముజరుగ పోవుటకపైగా ప్రమాదముమాత్రము నిశ్చయముగా జరుగును.

బాలాజీ

కర్తవ్య నిర్వాహణములో ప్రమాదముల కేగాదు మృత్యుదేవతకైనను లక్ష్యము లేదు-

జయశ్రీ

ఏమి- ఆకర్తవ్యము! నేనుగూడ వినవచ్చునా?

బాలాజీ

నీకుఇదివరకే తెలిసియుండును.

భరత భాగ్యవిధాత మాప్రాణనేత
పరమధర్మమూర్తి శివాజి ప్రభువె ఎటులో
చిక్కిపోయెను పాదుషా చేతికపుడు
మొగలు రాజదర్బారులో మోసపోయి.

జయశ్రీ

అవును! పాపము.

బాలాజీ

రాంసింగ్‌తో పాటు శివాజీపై మీనాన్నగారినిగూడ పాదుషా వారు నియమించినారు, రాంసింగ్ మాట అటుంచుము! మీనాన్న గారు కూడనిపగబూనుచున్నారు. వారిని ప్రార్థించుటకే వచ్చినాను-

జయశ్రీ

: తాళము చెవులు నులుపుచు :

అసంభవము! ముమ్మాటికి అసంభవము! అటు సూర్యుడు ఇటు పొడిచినను- అసంభవము!

బాలాజీ

గత్యంతరము లేదా జయా!

జయశ్రీ

జయ చేతిలో ఏమున్నది-

: తాళము చెవులు క్రిందకు పడవేయును :

బాలాజీ

అవేమి? జయా!

జయశ్రీ

మానాన్నగారి తాళము చెవులు! ముద్రిక!

బాలాజీ

అవియే నాచేతిలోనున్న

జయశ్రీ

వీనివల్ల ఏమిలాభము?

బాలాజీ

చాలవరకు కృతకృత్యుల మయినట్లే! ముందుపహారీవాళ్ల బాధ తప్పాను-

జయశ్రీ

నాచేతిలోనున్న మీ చేతిలో నున్నట్లేకాని... కాని ... కాని ఏమియును లేదు- ఇవిగో! తీసికొనుడు- : ఇచ్చును :

బాలాజీ

: పుచ్చుకొని : జయా మీనాన్నగారు చండశాసనుడు. నిన్ను క్షమించునా?

జయశ్రీ

క్షమింపరు!

బాలాజీ

: తిరిగి మీదపడవైచి : జయా! వద్దు! జయా! నిన్ను మీనాన్నగారు క్షమింపరు! నిన్ను తిరిగి ఎవరు రక్షింపగలరు?

జయశ్రీ

: పుచ్చుకొని : అగాధవిషము సమస్యఏదుకైనది- పరాత్పరా! స్త్రీ హృదయము! దుర్బలము! దయామయా! నాకు దారిచూపించు! మహావీరుడా! ఇవిగో- గైకొనుము! మహారాజును రక్షింపుము- మహారాష్ట్రము నుద్ధరింపుము. భారతభాగధేయమును కాపాడుము! నాజీవితముగూడ ధన్యమగును! సర్వము నిర్వహింప మీకునునాకును ఆగును దేవులే కలరు

: ఇచ్చును :

బాలాజీ

: పుచ్చుకొని : జయా! నీవు ... ...

జయశ్రీ

అదుగో- గుమ్మము- చప్పుడు- మహావీరుడా! ఇక ఇక్కడ ఆగవద్దు! —— ——! అరుగో మానాన్నగారు!

బాలాజీ

జయా! —— —— కృతజ్ఞత! భయములేదు! ఈప్రాణములు నీకై ఎగిరి వ్రాలును.

: తెర :



# ★ అష్టమ రంగము ★

ఉదయపూరు సౌధము

శివాజీ

నేతాజీ! - ఒకసారి ఇటువచ్చెదవా?

నేతాజీ

మహారాజా! ఆజ్ఞ!

శివాజీ

అవసరములేదు నేతాజీ! పోయి విశ్రమించుము. రాత్రి చాల ప్రొద్దుపోయినది. కాదు- ఆగుము - ఒకసారి ఇటురమ్మా- నిన్ను ఒక మాట అడుగవలెను.

నేతాజీ

మహారాజా! అవశ్యము, ఆజ్ఞాపింపుము.

శివాజీ

నేతాజీ! నీవు ఒక ఉన్నత పర్వత శిఖరాగ్రముమీద ఉన్నావు. ఒక పెద్దపులి అకస్మాత్తుగ ఎదురయినదనుకొనుము. అప్పుడు- ఆశిఖరాగ్రమునుండి క్రిందికి ఉరికెదవా? లేక పెద్దపులి ముఖములో దూరెదవా?

నేతాజీ

ఇటునుయ్యి అటుగొయ్యి- ఏమిచేయవలెను!

శివాజీ

ఏమిచేయవలెను- పోనిమ్ము- ఏమిచేయనద్దు! ఆగు! ఏమియు చేయకపోయిన పెద్దపులి మ్రింగివేయును. కాదు- నేతాజీ! ఈసారి చెప్పు

ము. సహాసముద్రములో నీవు ప్రయాణము చేయుచున్న నావ చిల్లుపడి నడనుకొనుము- నావలో కూలబడి కూర్చెనదవా? సముద్రములో ఉరి కెదవా? జాగ్రత్తగ ఆలోచించి సమాధానము చెప్పుము.

నేతాజీ

ప్రభూ! అటువంటి సమయములో- ఏమిచేసినను చేయవచ్చును. కాని- ఆలోచన మాత్రము పనికిరాదు.

శివాజీ

నిజమే ఇందు ఆలోచింపవలసినదేమున్నది? నేతాజీ! నేను ఎవరినో నీకు తెలియునా!- గుర్తింపుము.

నేతాజీ

అట్లనుచున్నారేమి? ప్రభూ! మీరు మరాఠసమ్రాట్టులు.

శివాజీ

కాదు- ఎన్నటికీ కాదు- అయిననేను మహారాష్ట్రమును పాలించుచున్నానా? ఈజయపూరు సౌధము మహారాష్ట్రరాజధాని కాదు గదా!

నేతాజీ

నిజమే! కాని- మీ మిత్రులు వచ్చిపోవుచున్నారు. మీ వైద్యులుచికిత్సచేయుచున్నారు. బ్రాహ్మణులకు దానము లిచ్చుచున్నారు

శివాజీ

అయిననేను స్వతంత్రుడనేనా? నేతాజీ; నీవుపొరబడుచున్నావు నేను ఆగ్రావదలి ఒక అడు గైనపెట్టగలనా? నేనుమరాఠసమ్రాట్టును గాను. మొగల్ సామ్రాజ్య చక్రవర్తి అలంఘీరుపాదుషా వారి ఖైదీని

చూడు- అనవరతము ఈసౌధముచుట్టు ఎందరు కావలిగాయు చున్నారో!

నేతాజీ

ప్రభూ! బాలాజీ ఆగ్రా చేరినాడు.

శివాజీ

ఆవిషయమునాకు తెలియును. కాగితముకలము తీసికొనిరమ్ము

నేతాజీ

చిత్తము. ఇవిగో!

శివాజీ

ఒకలేఖవ్రాయవలెను- శ్రీశ్రీశ్రీ మొగల్ సామ్రాజ్యచక్రవర్తి శ్రీఅలంఘీరు పాదుషావారి దివ్యసముఖమునకు- మిత్రుడు శ్రీశివాజీమహారాజు విన్నపము.

జహాపనా! పురందర్ సంధిసూత్రముల ప్రకారము మేము దర్బారునకు రానవసరము లేదు. కాని- పాదుషావారి సుహృల్లేఖనందుకొని- దర్బారులో వ్యక్తిస్వాతంత్ర్యమును గోల్పోయినాము. మహానుభావుడు అక్బర్ చక్రవర్తి. ధర్మప్రభువు షాజహాన్ పాదుషాల వంశకీర్తి నిమిన్నింపప్రార్థన.

మీసేనకులైన దండనాథులు- మంత్రులు యథార్థమును కప్పిపుచ్చి మండుచున్న అగ్నికుండమును ఎండుగడ్డితో కప్పజూచుచున్నారు. వారిస్వామిభక్తిపరాయణత హాస్యాస్పదము.

తమరు సల్పుచున్న 'ధర్మయుద్ధములకు' ధనమును సంగ్రహించుటకు జిజియా సుంకమును విధించినారని విన్నాము- చూడునేతాజీ కావలివాండ్రు కదలుచున్నట్లున్నారు-

నేతాజీ

మహారాజా! సుఖముగ నిద్రించుచున్నారు. సురాపానము, మాతృహృదయమువలె వీరిని జోకొట్టినది.

శివాజీ

సరే! చదువుము- ఏమి వ్రాసినావో!

నేతాజీ

ధర్మయుద్ధముల కొఱకు.

శివాజీ

వార్తయును- జిజియా సుంకమును విధించినట్లు విన్నాము- భారతసామ్రాజ్యచక్రవర్తి మొగల్ పాదుషా జైనదిగంబరుల, బౌద్ధభిక్షుకుల హైందవ కాపాలికాపంగ్వంథ భిక్షుక బ్రహ్మచారుల ఆకలి కూటికిగూడ కక్కుర్తిపడెనని మొగల్ సామ్రాజ్యచరిత్ర చెరిగిపోని ఇనుప అక్షరములతో వ్రాసిపెట్టును- బైరాగుల భిక్షాపాత్రలో, క్షుధార్తులగంజిలో చక్రవర్తిపాలు కోరదగునా? పవిత్రమైన శ్రీమద్ ఖురాను జగదీశుని విశ్వపితయని పేర్కొనుచున్నదే! చేతనైన జిజియా సుంకమును రాజపుత్రవీరుడు శ్రీ రాణా రామసింహునుండి రాబట్టుడు. అనంతరము తమ శ్రేయోభిలాషియైన ఈశివాదగ్గరనుండి రాబట్టుట కష్టము గాదు- తమ ఆజ్ఞలేకనే యీసాధమును వీడుచున్నందుకు క్షమార్హుడు

విధేయుడు,
శివాజీ మహారాజు.

: ప్రవేశము- బాలాజీ- నీరాజీ :

శివాజీ

సర్వము సంసిద్ధమేగదా?

బాలాజీ

మధ్యాహ్నము బ్రాహ్మణులకు దానము సల్పిన రెండు పండ్లబుట్టలు దుర్గద్వారముకడదాచినాము. ఇకఆలస్యముచేయరాదు.

హీరాజీ

మహారాజ్ — మీరుధస్తున్నిటిని ధరించినాను- ఈనాడు నేను మిక్కిలి అదృష్టవంతుడను—

సోదరా ! హీరాజీ: వస్త్రములతోపాటు నాదురదృష్టమును ధరింపవద్దు.

హీరాజీ

మీస్వర్ణకంకణము ప్రసాదింపప్రార్థన.

శివాజీ

ఇది ప్రస్తుతము స్వర్ణకంకణము. మరాఠసార్వభౌముని అభిజ్ఞాన ముద్రిక. కాని- సోదరా! ఇదిక్షణకాలములో మృత్యుదేవి ప్రళయకాల కరాళ కఠోర కృపణయులాంచనముగ మారిపోగలదు. : అందించును :

హీరాజీ

అద్యతనమహారాష్ట్రచరిత్రలో, మృత్యుదేవి తనకఠోరకరాళ లాంఛనమును విజయలక్ష్మికి అంకితమిచ్చినది.

శివాజీ

జనని భవానీ యీ దీక్షాకంకణమును ధరించినన్నీపై అమృతాశీస్సులు వెలయించుగాక!

:నిష్క్రమణము:

: తెర :

# నవమ రంగము.

## : ఆగ్రానగరము : అరణ్యప్రాంతము. :

బుట్టల కావడి మోయుచు ఒకరంగ పార్శ్వములోనుండి ఇంకొక రంగ పార్శ్వములోనికి పోవుదురు:-

శివాజీ

సహ్యావతులారా ! మీ ప్రతిజ్ఞ దుర్ఘటఘటనాసమర్థమైనది. నేటినుండియు మహారాష్ట్రమున శివాజీయేగాక రాజనీతిని ఔరంగ జేబుపాదుషాను తలదన్నిన మరాఠకుమారులున్నారని లోకము తెలిసి కొనుగాక.. మీదీక్షకు సాధన్యవాదాలు.

బాలాజీ

మహారాజా, ఈపవిత్రధర్మ నిర్వహణమున మిమ్ములను నిమిత్త మాత్రులుగ జేసినందులకు జగదీశునకు కృతజ్ఞులము.

నీరాజీ

మహారాజా! లోకమునంతయు కనుమాపుశక్తి అలంఘీరు పాదుషావారిది- మిమ్ములను చూచుచున్న మాకనులను మేమే నమ్మ లేకున్నాము- ఆగ్రానగరము! జయపూరుసాధము! పాదుషా చేతినుండి విముక్తి!

శివాజీ

కత్తులబోనులో నిరికి గాసిలుమాకు విముక్తిగల్గె పీ
రోత్తమలార! జాగికముహూర్తముకూడదు పాదుషాహి బల్
జిత్తులమారి, ఏదొప్రతిచేయదలంచుచునుండు, ఎత్తుపై
ఎత్తులఆటకట్టగల డేమరు పాటొక ఇంతకల్గినన్.

బాలాజీ

మహారాజా! పట్టుపడుదుమను భయమిక ఎంతమాత్రమును లేదు! ఇంతటి అద్భుతసన్నివేశమును సంఘటించిన జగన్నాటకసూత్రధారి అంతటిరసాభాసమును గల్పించునా?

శివాజీ

నిజమే! మనముగూడ- పురుషకారముకొరవడకుండ ప్రవర్తింపవలెనుగదా!

బాలాజీ

అనంతర కర్తవ్య మాజ్ఞాపింపప్రార్థన.

శివాజీ

కర్తవ్యమా? ఏమున్నది? దారిలో ఎన్ని వేషములు వేయవలెనో! రంగపరికరము లేవి?

నీరాజీ

ఇదిగో భిక్షాపాత్ర! కమండలువు. పాదుకలు. విభూతి. సువర్ణనాణెములు. కాషాయవస్త్రములు.

శివాజీ

సరే! బయలుదేరుదమా!

బాలాజీ

ప్రభూ!

అంబరవీధినుండి అమృతాంశు ప్రసన్నకళావిలాసముల్
బింబితమైరచించె, చికిలీసొగసుల్ యమునాతరంగ భం
గంబుల; మ్రోగుచున్నది మొగల్ మొగసాల, ద్వితీయయామ భా
గంబున ఘంటనాదము నికర్షణవాయుతరంగలీనమై-

: తెర :

# దశమరంగము

:అరణ్యము - ఆశ్రమపరిసరము:

; జయ - మధురికలు - పురుషవేషాలలో :

మధురిక.

జయా! వింధ్యాసాత్పురాపర్వతపంక్తులుదాటి దక్షిణాపథము జేరి దుర్గమారణ్యములెన్నియో గడచి వచ్చుచున్నాము- మనగుఱ్ఱములు అలసిపోయినవి. ఈనది పేరేమో! కొండలోయలోని ఆసరోవరమెంత రమణీయముగనున్నది! అదుగో నాలుగుతోవలుకలియుచోట-ఇదేనా మనమనుకొనిన కూడలి.

జయశ్రీ

ఎందుచేతనో నాహృదయము ఆశ్రమ పరిసరములకు వచ్చినట్లు ప్రశాంతివహించుచున్నది- మహాముని ఆశ్రమము ఎచ్చటనున్నదో:

మధురిక

అదుగో ఆటవికులు నృత్తము చేయుచు వచ్చుచున్నారు - వారినడిగి తెలిసికొందము

— ఆటవికనృత్తము —

:ఆటవికులు ప్రవేశము:

జయశ్రీ

చూడు! మధురికా! ఈఆటవికహృదయములలో గూడస్వచ్ఛమైన కళాతరంగిణి ఎంతసుందరముగ ప్రవహించుచున్నదో.

మధురిక

నృత్తము మోటుగానున్నదని చెప్పుటకు సుందరమనుట, నాగరక పరిభాషకాబోలు-

జయశ్రీ

మధురికా! నాహృదయమునీకు తెలియదా?

అడుగులపొందు, తమ్మటలయాన్విత తాండవకేళి నారక
చ్ఛదములవాలా కుచ్ఛఖల సందుల తళ్కులబెళ్కుసొంపు లీ
బెడగుల నెల్లనెట్టులటపీ చరులందరు నేర్చినారలో
అడవులు నాట్యమందిరములయ్యె కళాలతకాలవాలమై.

ఆటవికులారా! మీకుశ్రీరామదాసస్వామివారి ఆశ్రమమెచ్చట నున్నదో తెలియునా?

ఆటవికులు

సిత్తం- అల్లదుగో! వాగుమలపులో చెట్లగుంపులో ఉంది.

: రామదాసు పాడుకొనుచు ప్రవేశము :

శ్రీరామా! జయరామా
సీతారామా! జయజయసమర్థ శ్రీరామా॥

జయశ్రీ - మధురిక

భగవాన్ శ్రీసమర్థరామదాస స్వామివారికినమస్కారములు-

రామదాసు

:ఆశ్చర్యముతో: తల్లులారా! ఇచ్చటిల వచ్చినారు?

జయశ్రీ

మాతండ్రిగారు ఆగ్రాలో రాజోద్యోగి. మేము మహారాష్ట్రులము. మరాఠదేశమునుండి ఆగ్రాకు వెళ్ళుచుండగా మార్గమధ్యమున దొం గలుకొట్టినారు. ఆగందరగోళములో ఏమిజరిగినది చెప్పుటకు మాకే తెలియదు—రాత్రిసమయము—మేము తప్పించుకొని ఈవేషములు

రామదాసు

చిరుతప్రాయము మీమొగము చెప్పక చెప్పుచున్నది! ఏల ఈ ఘోరాటవిలో ఒంటరిగా వచ్చుచున్నారు.

జయశ్రీ

మహాభాగా! క్షమింపప్రార్థన! : పురుషవేషము తీసివైచి : నిజరూపమును మరుగపరుప వలసివచ్చినది.

రామదాసు.

అయ్యో! పాపముమీనాన్నగారు!

జయశ్రీ

మానాన్నగారు ఆగ్రాచేరినారో లేదో! తమపూజ్యనామధేయ మును చాలసారులు విన్నాము. ఆశ్రమములో ఆశ్రయము లభింప గలదని వచ్చినాము.

రామదాసు

తల్లులారా! మాఆశ్రమములోనుండుటకెట్టి అభ్యంతరమును లేదు! మావృద్ధగౌతమి- మీకుతోడుగా నుండును- మీతండ్రిగారు నిరపాయముగా ఆగ్రాచేరిన సంగతి తెలిసినవెంటనే- మీకు తగిన

రక్షణనిచ్చి ఆగ్రాకు పంపెదను. అంతవరకు- ఆశ్రమోచితమైన జీవితమును మాతో గడుపవచ్చును.

జయశ్రీ

కృతార్థులము-! చిరతరానేక జన్మసంచిత పుణ్యఫలముచే తమ ఆశ్రమములో తమ ఆశీస్సులతో-భగవద్ ధ్యానముచేయు సదవకాశములభించినది- ఇక మాపాపము లన్నియు పటాపంచలైపోవును-

రామదాసు

తల్లీ! నీభక్తిభావమునకు సంతోషము. పూర్వవయస్సులోనే దేవదేవునిపై మనస్సు మరలించిన కర్మబంధమునుండి త్వరలోవిముక్తి గల్గును- తల్లీ నీఆశయము త్వరలో సిద్ధించును-

: రామదాసు, మధురిక, జయ నిష్క్రమణము :

: తెర :



# ★ ఏకాదశ రంగము ★

: ప్రయాగ ప్రాంతము. అరణ్యము :

శివాజీ

తండ్రీ- నడువ లేకున్నావా?

శంభాజీ

పితాజీ నడువగలను_

శివాజీ

నాయనా! దగ్గరకు వచ్చినాము!- ఆకనపడు గోపురములు ప్రయాగ వేకాబోలు.

శంభాజీ

పితాజీ! నడువగలను!-

శివాజీ

కుమారా! ఆగు, జనసమూహామువలె కన్పించుచున్నది. : పరికించి :- ఎట్లయినను మనమీపొదలమాటున దాగి చూడవచ్చును.

: ప్రవేశము సార్థవాహులు :

సార్థవాహుడు (౧)

బావా! నీకుకూడా ఈకాలిశని ఎందుకు? బోలెడుడబ్బుమూల్గు చున్నదికదా, టింగు రంగామని పంచకల్యాణి గుఱ్ఱమునుకొని టక్ టిక్‌మని పోకపోయేవాడినా నాకే నీడబ్బుఉన్న

సా (౨)

ఆగ్రానగరములో బందీకృతుడైన శివాజీ తప్పించుకొని పారిపోయినాడట!

సార్థవాహుడు (౧)

తాడిచెట్టు ఎందుకుఎక్కినావు, అనిఅడిగిన దూడగడ్డికని సమాధానము చెప్పినాడట నీవంటివాడు!

సా (౨)

గొప్పగాఉన్నది నీతెలివి! అశ్వవర్తకులెవ్వరు అశ్వములను అమ్మరాదని రక్షకభటాధికారి భూలతఖాన్ కఠోరశాసనము వినలేదా?

సా (3)

అశ్వము దొరకినంతమాత్రమున శివాజీకి లాభమేమి?

సా (౪)

శివాజీకి అశ్వములభించిన అభ్రవాహానునివలె ఆకాశమార్గమున అంతర్ధానముకాడా?

సా (౧)

గుడిమ్రింగేవారెక్కడ! గుడిలోని లింగమును మ్రింగేవారింకొకరు! అసలు శివాజీ పాదుషాచేతికి ఎట్లుచిక్కినాడు?

సా (౨)

పురంధరుసంధికిముందు పాదుషా సైన్యము లోయలో చిక్కుకొనిపోయినది అప్పటికే మహారాష్ట్రులు అలసిపోయినారు. జగజ్జెట్టువంటి సేనాపతి బాజీ పోయినాడు- అందుచే సంధికుదిరినది. తరువాత! రాంసింగ్ జయసింగ్- శతాధికోపాయులచే శివాజీని దర్బారుకు పంపించినారు. అక్కడ చిపరకు చిక్కుకొన్నాడు.

సా (3)

తిరిగిఎట్లు తప్పించుకొనినాడు?

సా (౪)

అది చాలాచిత్రముగానున్నది.

శివాజీ

కుమారా, భయములేదు- మనపున్నెము పండివచ్చినది. ఈసార్థవాహములో మహారాష్ట్రులుకూడ ఉన్నారు.

మహాభాగులారా! నమస్కారము!

సా (౪)

(4) సమస్తమంగళావాప్తిరస్తు! అలికంబున అక్షి నిడాచిన ఆదిభిక్షువువలె పరిత్యక్తమైన మహానుభావుడవు నీవెవ్వరవు.

శివాజీ

మహాశయులారా! మేముబాటసారులము-

సా (౧)

(1) నీటికుండ అయిన లేదా? ఎచ్చటనుండి వచ్చుచున్నారు. ఇట్లుఒంటరిగా అరణ్యములో సంచరించుట ఎంతసాహసము!

శివాజీ

సాహసమునకు తగినపరాభవమైనది. మార్గమధ్యమున దొంగలకు చిక్కినాము! నీటికుండయైనయుండుటకు వీలులేకుండ చేసినారు ఈకుమారునితో విధివిపరిపాకమున-

సా (౪)

మహాభాగా! కష్టములు ఎల్లకాలము నిలిచియుండవు.

శివాజీ

సత్యసంకల్పులగు తమబోటి బ్రాహ్మణపుంగవులవాక్యములు వ్యర్థములగునా?

సా (౧)

మీవాగ్విన్యాసము చూడ మహారాష్ట్రులవలె కన్పించుచున్నారు!

శివాజీ

మహారాష్ట్రులలో దేశాభిమానము హెచ్చు; నన్ను నేను కాపాడు కో లేనిస్థితిలో

సా (౩)

మహాశయా! ఏమట్లు సందేహించుచున్నారు.

శివాజీ

ఈకుమారుని తమతో మహారాష్ట్రమునకు తీసికొనిపొండుమీ మేలు...

సా (౨)

మహాభాగా!- మీమనోరథమును గ్రహించితిని- ఈకుమారరత్నము నాయొద్దనుండగలడు-

శివాజీ

నాయనా! ఈమహాపురుషుడే నీకు తల్లియు తండ్రియు దైవము వీరితోపొమ్ము! గ్రహించితివా?

సా (౨)

మీకుమారునికి వచ్చిన భయమేమియు లేదు. మహారాజు బిడ్డలాగున చూచెదను.

శివాజీ

కృతార్థుడను- మీరువచ్చుచున్న మార్గము ఎచ్చటకుపోవును-

సా (౧)

ఆకనపడుచున్నదే ప్రయాగ-

శివాజీ

శలవు- : సార్థవాహులు నిష్క్రమించెదరు : : రెండవ తెరపడను :

శివాజీ

: ప్రవేశించి : ఓహో! ఈగుఱ్ఱములు బారులుతీర్చి ఎంత బాగున్నవి_ ఓయీ! వణిగ్వరా!

వర్తకుడు

: ప్రవేశించి : సలాము!

శివాజీ

సలాము! మాకొక గుఱ్ఱము కావలెను.

వర్తకుడు

ఫకీర్‌జీ! అశ్వములను ఎవ్వరికిఅమ్మరాదని పాదుషా హుకుమ్. శివాజీ పరారీఅయినాడటం

శివాజీ

అమ్ముటకేమి? మేముపోయిపాదుషాతో పిర్యాదు చేయముగదా!

వర్తకుడు

ఏమిచ్చెదరు?

శివాజీ

ఖరీదునకేమి? ఇదిగో : సువర్ణనాణెములు చేతిలోపోయును :

వర్తకుడు

ఒక గుఱ్ఱమునకిన్ని సువర్ణనాణెములా? : పరికించిచూచి : అమ్మయ్యో బాబో శివాజీముద్ర!

శివాజీ

: వర్తకుని గొంతుపట్టి కత్తిదూసి రంగపార్శ్వములోనికి గొంపోవును. తిరిగిప్రవేశించి : అశ్వము లభించినది కాని అయ్యో! ఎంత దారుణకృత్యమున కొడిగట్టితిని. నిర్దోషినిహత్య! జననీ భవానీ

రాజధర్మము దారుణవ్రతము; సకల
పాప భూయిష్ఠము; నరక పంకిలమ్ము;
ఓజగన్మాత! రాజధర్మోపహతుడు-
ఈ వణిజుని ఆత్మకుశాంతి నివ్వవమ్మ!

: తెర :

# ద్వాదశరంగము

: సన్యాసివేషముతో ప్రవేశించి :

**శివాజీ**

అదె కాశీనగరమ్ము! గంగ అదిగో! అంభోరుహశ్రీకరుం
డుదయార్కుండు మరీచిరక్తరుచిరాస్యుండయ్యె ప్రాగ్రేఖపై
అదె విశ్వేశ్వరుగోపురప్రకర ముద్యత్కాంతులన్ నీలనీ
రదశోభామకుటాగ్రమై గగన పర్యంతంబు దీపించెడిన్!

పరికించి:

ఆ ధర్మమస్సులోబడి ప్రయాణమొనర్చి అరణ్యముల్ దయా
సింధు భవానిమాత కృపచేతగమించితి పాదుషాభట
స్కంధము నాల్గుమూలలను కన్నులువిప్పుచు కాయుచుండ దో
ర్గంధులు రాజ్యరక్షణ దురంధరులందరి మధ్యనుండియే

ఏమీ! పాదుషా చాతుర్యము! ఎన్నివలలు-ఎన్నిఉచ్చులంతో పన్నినాడు!! బోనులో ఒకసారిపడిన ఎలుక తిరిగి బోనులో బడుట అసంభవమని ఎరుగడు కాబోలు!

ఎట్లో విశ్వేశ్వరుని సాన్నిధ్యము చేరగల్గితిని. దూరప్రయాణ భారముచే ఈ అశ్వముకూడ అలసిపోయినది. ఏమీ! గంగానదిలో ఒక్కనావయైనను కదలుటలేదే! జాలరచాపలు మాత్రమె త్రియుంచిరి. ఓహో! ఆలంఘీరుపాదుషా! యీ తంత్రాంగమును భారతపుత్రులు చాణుక్యులవారి కాలమునుండి ఉగ్గుపాలతో నేర్చుకొనుచున్నారు

: పరికించి, : కాని

గంగనుదాటి ఎట్లవలి గట్టునుచేరుదు? పాదుషాజ్ఞచే
లంగరు లెత్తినారలు శరాసులు నావలకున్ ...గమించెదన్
భంగము కల్గకుండ పలుపాత్రలదాల్చి, కుశీలవుండనై
రంగముమారె, కావున తురంగముపీడి నటింతుమానినై.

అశ్వరాజమా!

నీకుమిక్కిలి శ్రమఇచ్చితిని. కృతజ్ఞుడను! శివా, చిత్రరూపములో సదా అశ్వవాహనుడై వెలయగలడు. ఈ గంగా శాద్వలభూముల పచ్చికమేసి, సేదదీర్చుకొనుము.

ఆవధాని

: ప్రవేశించి) మహాత్మా! నమస్కారము. :

శివాజీ

: ఒంటిపోగు జందెమునుచూచి : శీఘ్రమే వివాహప్రాప్తిరస్తు

అవధాని

ఈపేద బ్రాహ్మణునకు పిల్లనిచ్చు వారెవరు? అమోఘ వచస్కులగు తమ ఆశీర్వచనమువిన్న పరమానందముతో మా ముసలితల్లి మురిసిపోవును. పేదవాని ఆతిథ్యమని నిరసింపకున్న నేడుతాముమాయింట భిక్షావందనములు గైకొన ప్రార్థన.

శివాజీ

నాయనా! మీ యిల్లు... ...ఎక్కడ?

అవధాని

ఈ మహానగరమున మాబోంట్లకు వసతిగృహములు ఎక్కడ లభించును? ఊరులో ఒకమారుమూల పేదవిప్రులవాడలో మాయిల్లు.

శివాజీ

వత్సా! విచారింపకుము! నీపేదరికము శీఘ్రమే పటాపంచలై పోవును.

అవధాని

కృతార్థుడను. దయచేయుడు

:నిష్క్రమించెదరు:

: ప్రవేశము :

: సోమయాజిదీక్షితులు :

సోమయాజి

"దాడీవాలా ఫకడో ఫకడో" అని నన్నుపట్టుకొన్నారు. మొఱ్ఱో మొఱ్ఱో అనిగోలపెట్టినను విన్నారా? వినలేదు! పురపాలకుని దగ్గరకు రమ్మన్నారు. ఏమిపుట్టుమునిగినది? నన్ను పట్టించినారేమి మీయిల్లు బంగారముగాను అని అడిగినాను- " ఇంకేముంది గంగానది అంటుకున్నది" అని ఇటు అటు గబగబా పరుగెత్తుట మొదలుపెట్టినారు. 'శివాజీ పరారీ హోగయా' అన్నాడు ఒకడు-ఓరి దౌర్భాగ్యులారా! చివరకు శివాజీ తప్పించుకొన్నాడన్నమాట. నేను అనుకొనుచునే ఉన్నాను. అనుకొనుచు పురపాలకుని దగ్గరకు పోయినాను. నేనుచచ్చి నీకడుపున పుట్టనూ! సద్బ్రాహ్మణుడను నన్ను వదలిపెట్టండి' అని చెప్పినాను నామాట వినలేదు! సరిగదా: అధికారమదంబు గుడ్లెఱ్ఱంజేయంగా పండ్లను పటపటంగొరికి 'నీవే శివాజీవి, నిజముచెప్పు! ఈ మాత్రము గ్రహింపలేనా! పాతిక సంవత్సరాల ఉద్యోగానుభవము. ఈపప్పు నాదగ్గర ఉడకదు! తప్పించుకొన్న కొండఎలుకను తిరిగిబోనులో

పడునట్లుచూడమని ఆ పాదుషావారిహుకుం ॥అని గాండ్రించి గోండ్రించి నాడు. నేనంత "ఓరీ! చపలకరాపీ! నేనే శివాజీనైన సీతలకాయు, సప్తసముద్రింబులకును అవ్వలిగట్టుపై-మారీచునితలకాయ శ్రీరాముం డు గొట్టినట్లు గొట్టకపోదునా! అని మనస్సులో అనుకొని: పైకి, "మహాప్రభూ! ఖాన్‌సాహేబ్ చంద్రమా! నేను బ్రాహ్మణుడను- సీకు పుణ్యముండును- దయయుంచి నన్ను వదలిపెట్టుము" అనిప్రార్థించి నాను - అప్పుడు - వెంటనే - కొండముచ్చుమొగము వేసికొని - "ఆయిన ఈగడ్డము మీసాలుఎందుకుపెంచినారు" పటాటోపముతో చివాలునలేచి - మీదకురికినాడు - నేనుతప్పించుకొని "సాహేబు గారూ! తొందరపడకండి!గడ్డంబును మీసలును బెంచుటకుంగారణంబు మదీయభార్య చిరంజీవిని సౌభాగ్యవతి గర్భవతిఅని చెప్పకతప్పినదిగాదు- ఇంకేమున్నది— పక పక నవ్వులు పకుచుకుపడ్డారు- అప్పట్టునన్- నాకు వీరావేశంబువచ్చినది - కాని - ఇది సమయంబుగాదని - తప్పించు కొని వెక్కిరించమను- శాస్త్రవచనంబుండలంచుకొని నవ్వు నాలు గువిధాలచేటు - అనిమనస్సులో అనుసంధానంబు జేసికొని పైకి "నా నయులార్గా! నవ్వండి - నవ్వు-నలబదివిధాల మంచిది. కంఠనాళాలకు మంచికసరత్తు, అదియునుంగాక 'ఆనందవార్ధిని అందరిడెందాల వ్యా పింపజేసెడి అంటువ్యాధి' అని మహాకవి అన్నాడు. అనిగంభీరోపన్యా సమును గాగభట్టువలె చేసినాను. అప్పటికి తలతిరిగి నన్ను వదిలి పెట్టినారు.

దీక్షితులు

ఊరుకొనండి! అరుగో— టోపీలవాళ్ళు!

సోమయాజులు

ఎవరికి తెలియదు! రంగు రంగుటోపీలతో ఇంద్రధనుస్సువలె అప్పుడప్పుడు ప్రత్యక్షమగుచుండును. కాని_ ఎల్లప్పుడు వానవెలిసిన తర్వాత తుపాను చల్లారినతర్వాత కనపడెదరు.

అసలు సమయంబున కంతర్ధానంబే!- వీరికి శివాజీ దొరుకునా?

దీక్షితులు

ఎక్కడి ఆగ్రా! ఎక్కడి మహారాష్ట్రము! మిఠాయి బుట్టలలో తప్పించుకొనినంతమాత్రమున ఏమైనది?

సోమయాజి

ఏ దౌర్భాగ్యుడు చెప్పినాడు! మిఠాయిబుట్టలలో పోయినాడని. పోవుచుండగా పారావాళ్ళు ఏమిచేయుచున్నారు? లొల్లాయి బుల్లాయి మాటలంజెప్పుట వలనం బ్రయోజనంబేమి? అసలురహస్యంబు నాకు తెలియును.

దీక్షితులు

ఏమీ అమాంతము మాయమైపోయినాడా? ఎంతమంది వెదకుచున్నారు! ఎంతహంగామా చేయుచున్నారు.

సోమయాజి

వీరిపౌరుషము- జబర్దస్తీ! మనబోటివాళ్ళమీద నే! పాదుషావారి వజీరు- ఏమన్నాడో తెలుసునా? "ఓఅలంఘీరు చక్రవర్తీ! మహాప్రభూ! మేమందరము చూచుచునేయున్నాము- చూచుచుండగనే అమాంతముగ అంతర్ధానమై పోయినాడు- పైలోకముల పైకెగిరి మాయమైపోయినాడో క్రిందిలోకములో పోయినాడో కాని, ఈభూలోకములో లేడని నిక్కచ్చిగా చెప్పగలనని నొక్కివక్కాణించినాడు.

దీక్షితులు

ఎవరికైనను ఇట్టిమాటలు చెప్పవచ్చును- పాదుషావారికి మాత్రముగాదు-

సోమయాజులు

అసలు రహస్యంబు నాకు తెలియును. చెప్పెదను సావధానంబుగా నాకర్ణింపుము!

దీక్షితులు

ఆహా! ఏకాకి! నిరాయుధుడయిన ఒకవ్యక్తికోసము మొగల్ సామ్రాజ్యమున కంతయు ఇంతటి భయభ్రాంతియా! శివాజీ రాజా! సెబాస్! వీరుడా! నీపేరు కొమ్ములు తిరిగిన మొనగాడు భటులందరకు, సింహస్వప్నమై పోయినది! భారతద్వీపకల్పమంతయు, సర్దారు దండనాధులతో పురపాలురతో- చివరకు భారతసామ్రాజ్య పాదుషాతో నీడనికిపట్టులు తెలియక గజగజలాడి పోవుచున్నది-

సోమ

ఏమయ్యా! ఎవరితో మాట్లాడుచున్నావు? శివాజీ నీయెదుట నిల్చునియున్నట్లు స్తోత్రముచేయుచున్నావే! ఇక్కడెక్కడున్నాడు? అసలు రహస్యంబు నాకు తెలియును. చెప్పెదను సావధానంబుగా నాకర్ణింపుము.

శ్రీ శివాజీ సమర్థరామదాసువారి శిష్యుండు. రాముండనిన సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు అపరావతారంబు. భక్తుడైన శ్రీ శివాజీ ప్రార్థింపగ దాసానుదాసుండును భక్తజనవత్సలుండునునైన శ్రీమన్నారాయణ మూర్తి అనుగ్రహించి తన గరుడవాహనంబుగా బ్రసాదించెను. అంత గరుడాళ్వారు, శివాజీ బంధింపంబడిన జయపూరుసౌధంబున సూక్ష్మ రూపంబునగా వ్రాలి, నిజరూపంబు ధరించి, ఒకరెక్కపై చిరంజీవి

శంభాజీని ఎక్కించుకొని, దివ్వైన అంతరిక్షమార్గమున కెగరి ౧౧ ఘడి యలు ౨౨ విఘడియలు ౪౪ విప్తలు ౫౬. విలిప్తలకు సరియైన సింహాల గ్నంబున సింహగడంబునందించెను- శ్రీమద్రమారమణ గోవిందాహరి!

దీక్షి

బాగున్నది: ఇక్కడ మీపురాణకాలక్షేపము! మధ్యాహ్నమునుండి ఏదో గుఱ్ఱము గంగాతీరమున మేయుచున్నదట. ఎంతప్రయత్నించినను గుఱ్ఱమెవరిదో తెలియుటలేదు- అందుచేత! కొంపదీసి- శివాజీయే ఆగుఱ్ఱమెక్కి వచ్చి, కాశీలో ప్రవేశించినాడేమోనని అనుమానించుచున్నారు- సాయంకాలము పురద్వారములన్నియుమూసి, రాత్రిపట్నమంతయు పరిశోధించెదరట-

సోమ

ఓహో! అటులనా! ఏమీపరవాలేదు! ఇప్పుడు తెలిసినది. సరే! శివాజీ భవానీభక్తుడు కదండీ! ఒక్కసారి విశ్వేశ్వరుని ఆలయములోనికివెళ్ళి అమ్మవారిని ప్రార్థించియుండును- ఆదెబ్బతో అమ్మవారు నందీశ్వరుని అనుగ్రహించినది- వెంటనే- శివాజీ నందీశ్వరుని అధిష్టించి, ఆకాశమార్గాన జైపరమేశ్వరాయని ౮ ఘడియల ౩౨ లిప్తల ౫౪ విలిప్తలకుసరియైన వృషభలగ్నంబున రాజగడంబుచేరెను. శ్రీమద్రమారమణ ...... ...

దీక్షి

పుక్కిట పురాణములు చెప్పకండి! పాపము! శివాజీ కాశీలోనే ఉన్నట్లయిన— మిడుతంభొట్లువలె చిక్కిపోయినాడన్నమాటే!

సోమ

అట్లెన్నటికినీ కాజాలదు! ఏమనుకొన్నావో
“ కప్పించి మొగసిన కుండలంబులకాంతి
గగనభాగంబెల్ల గప్పికొనగ ”

శివాజీ ,, వనధిలంఘించు ఆంజనేయుని విధాన
గంగలంఘించి అవ్వలిగట్టుచేరు ''

శ్రీమద్రమారమణ గోవిందాహరి.

దీక్షి

పిచ్చిమాటలు చెప్పకు! గంగలంఘించునప్పుడు అందరూ చూడరా! రక్షకభటులకు దొరకిపోడా?

సోమ

అట్లయిన గప్‌చిప్‌గా మత్స్యావతారంబుదాల్చిన మహావిష్ణువు వలె గంగలో ఈదుకొనిపోవును. అంతేకాని ఈమహాభక్తుండు-మహాపురుషపుంగవుండు- ఈమహానుభావుండు- ఈ వెర్రి వెంగళప్పలకు దొరుకునా?

భజగోవిందం భజగోవిందం భజమూఢమతే!

: ఇద్దరు నిష్క్రమించెదరు :

: శివాజీ, అవధాని ప్రవేశము :

శివాజీ

అబ్బాయీ! మీఅమ్మగారు సాక్షాత్తు నాపాలిటి అన్నపూర్ణ. మాతృహృదయము అవ్యయప్రేమనిధానము- తల్లిఋణమును ఎవరు తీర్చుకొనగలరు?

నీకు త్వరలో మంచిధనయోగమున్నది- అప్పుడు- పెండ్లిచేసికొని- మీతల్లిని సుఖపెట్టుము! నీవచ్చట కూర్చుండుము- నేనిదే

గంగానదిలో సాయంసంధ్యవార్చివచ్చెదను- నాకక్షపాల! విభూతిఅన్ని యుసంచిలోనున్నవి! జాగ్రత్త!

అవధాని

చిత్రము!                                    : నిష్క్రమించును :

: తెరలో కలకలము :

శివాజీ

ఏమా కలకలము! రాజభటులా! పాపమీ బ్రాహ్మణకుమారుడు! - సంచినిండ సువర్ణ నాణెములు నున్నవిగదా! - విప్రకుమారా! శెలవు-

: తెరలో కలకలము :

తల్లీ భవానీ!

బంధమునుండి నేబయలువడ్డ క్షణంబుననుండి సర్వది
గ్బంధమొనర్చినాడు, ననుపట్టుతలంపున పాదుషాహి; దు
స్సంధులు గూఢచారులు, నిశాచరులైరి పురంబులన్ జగ
ద్బాంధవుడస్తమించె పురపాలుడు మూసెకవాట మార్గముల్

తల్లీ గంగాభవానీ!

: తెర :



# ★ త్రయోదశ రంగము. ★

## ఆశ్రమ పూజామండపము.

: ప్రవేశము :

జయశ్రీ - బాలాజీ

జయశ్రీ

లలితలతావితానములు లాస్యము సల్పెడి, సంజకెంపుకొం
జిలుగులు జాలువారె సరసీహృదయంబున బింబితంబులై
జిలిబిలి కూకహూరవళి చిందుచు కోమల కంఠమెత్తిమేల్
కొలుపులు పాడెడిన్ కొదమకోకిల బాలరసాలశాఖపై.

తొలియుషస్సులలో కనులువిప్పి మకరంద
సౌరభమీను మందారవిరుల
ప్రత్యూష పవన తరంగమాలాడోలి
కలనూగు నవమాలికాసుమముల
అరుణ కాంతులలోన చిరునవ్వువిరజల్లు
సుందర తరుణారవిందములను
తెల్లవారెడువేళ తల్లిగారాబాల
పొత్తిళ్ళమేల్కొన్న పొగడపూల

తేటికన్నముందరపోయి తెచ్చినాను
పొద్దుపొడువకమునుపు నీపూజకొరకు;
చిన్నివన్నెల చిన్నారి కన్నెవిరులు;
ఆదరింతువు లేదో దేవాదిదేవ!

కర్పూరహారతు లర్పింప లేకుంటి
అందుకొనుము పుష్పహారములను
పన్నీటి జల్లుల పాద్యమీయగలేను
స్వీకరింపు మరంద బిందువులను
అగరుధూపంబుల అర్పింపజాలను
సంతసిల్లుము పుష్పసౌరభముల
చందన గంధమ్ము సమకూర్చలేనింక
గ్రహియింపు పుష్పపరాగములను
పచ్చకస్తూరి పులుగుజవ్వాజి లేదు
ఆదరింపుము నాహృదయార్పణమ్ము!
ఉడుతభక్తిని ఏమిత్తు ఉడుగరలను
అంజలిఘటింతునీకిదే ఆదిదేవ!

: బాలాజీని క్రీగంటజూచి : స్వాగతము!

**బాలాజీ**

దోసిట మల్లెమొగ్గల నధోముఖివై విరజల్లు ఓకళ్లో పాసిని! తమ్మికెంపుల నివాళుల నిచ్చు భవత్ కటాక్ష విన్యాసము దేవదేవు వదనంబున నిల్పిమరల్చు నీనిది ధ్యాసను, నల్లకల్వ పువులాడెడి చూపుల్లతోరణమ్ముగన్.

**జయశ్రీ**

ఎప్పుడు రాక?

**బాలాజీ**

ఎన్నడో నా మనఃఫలకమందు చిత్రించుకొన్న ప్రతిమ, కలలో గాంచుచున్న విగ్రహము, తీయతలుపులు కంపళించు శృంగారమూర్తి,

తలవని తలంపుగ నేడిచ్చట ప్రత్యక్షమగుట నాకన్నులను నేనే నమ్మలేకున్నాను!

ఏ అతిలోక సుందరి హృదీశ్వరియై రసభావవీచికా
మ్నాయము జాలువార చిరునవ్వులు చిందెడి పక్ష్మపాళి, స్వ
ర్గీయకళావిలాస మొలికించి, నటించి, అదృశ్యమయ్యెనో
ఆ అమృత స్వరూపిణియె ఆశ్రమమందున పూజసల్పునా?

మొట్టమొదట వనలక్ష్మీమూర్తిభవించి శ్రీభగవానుల ఆశ్రమ కుటీరముల పూజార్చన విధులొనర్చుచున్నదా అనిఅనుకొన్నాను కాని నిటుతిరుగునప్పటికి మాజయయే అనిగుర్తించినాను-

జయశ్రీ

పోనీ! ఇప్పటికైనను అనుగ్రహాము కలిగిగుర్తింపగల్గినారు!

బాలాజీ

చీనిచీనాంబర చిత్రవిలాసము
లనువీడి నారచీరనుధరించి
సంపంగి పరిమళ సహవాసమునువీడి
వ్రేలిన కురులేక వేణిజేసి
సంజకాంతుల మరుసంజ లీను స్ఫటిక
హారాలు చిక్కులు వారపెనగ
ఘనసార చందన కలపమ్ములు తొలంగి
తొట్రిలు మెయితీవ తూగియాడ
రత్ననూపురకంకణరాన మెడలి
ప్రకృతి యెల్లనురసమయత్వమును జెంద
దేవదేవు పూజించు నీదివ్యమూర్తి
ఆశ్రమమునందు నాకు ప్రత్యక్షమయ్యె.

నాకేమియుపాలుపోవుట లేదు. నీవిచ్చటనుండుట ఎట్లుతటస్థించినది?

జయశ్రీ

అడుగుట మరచినాను: ఎక్కడనుండి మీరాక?

బాలాజీ

ఆగ్రానుండి.

జయశ్రీ

మానాన్నగారు కుశలమేనా?

బాలాజీ

ఎంత ప్రశాంతముగా అడుగుచున్నావు? క్షేమమే! కానీ - ఆవిషమ పరిస్థితిలో - అసలు నీవిట్టిచటికి ఎట్లువచ్చినావు?

జయశ్రీ

ఏమున్నది! మానాన్నగారు క్షమింపరు! ఇక గృహాములోనుండుట అగ్నిమధ్యమున నుండుట- మామధురిక నేను పురుష వేషములతో గురుదేవుల సాన్నిధ్యమును చేరకల్గినాము - మానాన్నగారిని తరువాత కలుసుకొన్నారా?

బాలాజీ

ఒకరాత్రి, నేను తానాజీ కలుసుకొన్నాము

జయశ్రీ

అమ్మో! ఏమైనది?

బాలాజీ

ఏమీలేదు! జయా! నన్ను క్షమింపుము! నీహృదయము నేను అర్థము చేసికొనక కాదు; మీతండ్రిగారివల్ల అంతయు తెలిసికొన్నాను దీనికంతయు వారు నన్ను నిష్ఠురముగా నిందించినందుకు విచారించుట లేదు. కాని- నిన్ను పడరానికష్టముల పాలుచేసినందుకు విచారించుచున్నాను! జయానన్ను క్షమింపుము.

జయశ్రీ

నేనేమియు కష్టపడలేదు, పూజ్యపాదులు గురుదేవులుకన్న తండ్రి కన్న మిన్నగా ప్రేమించుచున్నారు.

: రామముని ప్రవేశము :

బాలాజీ

భగవాన్ గురుదేవుల పాదారవిందములకు శిష్యుడు బాలాజీ నమస్కారములు!

రామదాసు

రామ్‌రామ్! కళ్యాణమస్తు! నాయనా! ఎన్నాళ్లకు తిరిగి నిన్ను చూడకల్గినాను? శివా క్షేమమేగదా?

బాలాజీ

మహారాజు సురక్షితముగా రాజగడము చేరకల్గినాడు. మేము ఆగ్రానుండి బయలుదేరి మధురలోవిడి ప్రయాగలో కలిసికొని కాశీ ముందరపడినాము! కాశీలో చిక్కుపోయినారనుకొన్నాము! కాని-గంగలో ఈది అవతలిగట్టుచేరి తప్పించుకొన్నారు. గురుదేవుల అనుగ్రహము! భవానీకృప!

రామదాసు

రామ్ రామ్! సంతోషము_

బాలాజీ

ఈశుభవార్తమానము విన్నవించి, గురుదేవుల తోడ్కొని రమ్మని నన్ను పంపినారు-

రామదాసు

నాయనా! నీవుఆగ్రా వెళ్ళినావుగదా! నేను భ్రాంతికి మాజయశ్రీ విషయమై ఒకలేఖవ్రాసినాను. జయతండ్రి- తల్లీ- మీనాన్నగారి పేరేమి?

జయశ్రీ

గురుదేవా! వారెరుంగనిదేమియు లేదు-

రామదాసు

నాయనా! నీకెట్లు తెలియును! మరచిపోయినాను. నీవు ఆగ్రాలో చాలకాలమున్నావుగదా! ... ఏమి ఆవిషయము చెప్పు.

బాలాజీ

ఆగ్రా సేనాశిక్షాగారములో నాకు స్థానములభించుటచే జయ తండ్రిగారు భానోజిగారేకారకులు - ఆపరిచయముతో- తరచు వారింటికి వెళ్ళుచుండువాడను

రామదాసు

వారుకుశలమేగదా? దొంగలవలన సప్రమాదము లేకుండ ఆగ్రాచేరినారా?

బాలాజీ

:-జయవంకజూచి తెల్లబోయి-:

లే ... దు ... కు ... శ ... ల

రామదాసు

ఏమట్లుసందేహించుచున్నావు? నీవెప్పుడు వారిని కలుసుకొన్నావు? ఏమన్నారు?

బాలాజీ

వారుచాల ప్రభుభక్తి పరాయణులు- మహారాజును, గురు దేవులను నన్ను దూషించినారు-

రామదాసు

అదేమి నాయనా! అట్లెందుకు జరుగును?

బాలాజీ

శిక్షణానంతరము నేనుమహారాష్ట్రమునకు వచ్చుచుండగా- నాకుపాదుషాకొలువులో ఉద్యోగమిప్పించెదమనియు- జయశ్రీ నొక

కంట నన్ను మరియొకకంట జూచుకొందుననియు చెప్పి- గురుదేవులను ప్రేమించి నన్ను బంధింపజూచినారు.

రామదాసు

నీ వేమి చెప్పినావు?

బాలాజీ

మొదటిదానికి నేను సమ్మతింపలేదు. తరువాత రెండవదానికి వారు సమ్మతింపలేదు! మూడవదానికి నాకత్తి సమ్మతింపలేదు!

రామదాసు

బాగున్నది! తరువాత!

బాలాజీ

తరువాత! మహారాజు ఆగ్రాలో చిక్కుకొనినాడు! పహారీపై భానోజీని పాదుషా నియమించినాడు! అప్పుడు జయశ్రీని కలిసికొన్నాను. జయ- తండ్రిగారి ముద్రికనుఇచ్చి, మహారాజు విముక్తికి ఎంతో తోడుపడినది-

రామదాసు

తల్లీ! జయా! అమ్మా! నాధన్య వాదాలు-

బాలాజీ

భానోజీ చండశాసనుడు - జయనుక్షమింపరని, నేను తానాజీ మధురనుండి తిరిగి ఆగ్రా వెళ్లి ఆరాత్రి భానోజీగారిని కలుసుకొన్నాము. నన్ను చూచి మండిపడినారు. జయశ్రీ అప్పటికే పురుష వేషముతో ఆగ్రనుండి బయలుదేరియుండును - నాకు ఈసంగతి- ఈక్షణము వరకు తెలియదు - కాని వారు నేనే జయను మహారాష్ట్రమునకు-పంపినానని ... నిందించినారు!

జయశ్రీ

గురుదేవా! పురుషవేషముదాల్చి, అసత్యముపల్కినందుకు క్షమింపప్రార్థన - : కాళ్లపై పడును :

రామదాసు

: లేవనెత్తి : - తల్లీ! ఇప్పట్టున అసత్యదోషము లేదు - నిన్ను క్షమించుటకు నీవేమి తప్పుజేయ లేదు-!

బాలాజీ

కానీ జయశ్రీ నాపై చాలకోపమువచ్చియుండును.

రామదాసు

తల్లీ! - బాలాజీకూడ తనవిద్యుక్తధర్మము ననుష్ఠించె నేగాని. నీపై అనాదృతివహించిగాదు - బాలాజీమహారాష్ట్రమును ఎక్కువగా ప్రేమించినాడు

బాలాజీ

కృతార్థుడను-

రామదాసు

తల్లీ! ఆశ్రమమునకు వచ్చిన నీశీలసంపత్తికి ఆగాలో చూపిన స్వార్థత్యాగమునకు- నాకుపరమ సంతోషము-
బాలాజీ! కథ కల్యాణాంతమేగదా! మహారాజుదగ్గరకు పోవుదమా!

బాలాజీ

మహాప్రసాదము-

రామదాసు

జయశ్రీకూడ మనతోవచ్చును- రాజగృహములో మాతా జిజయాభాయి గృహము కల్యాణమహాలులో నుండగలదు.

బాలాజీ : జయశ్రీ

కృతార్థులము.

: తెర :

# ★ చతుర్దశ రంగము. ★

**వైతాళికులు**

రాజశశాంక శేఖర! మరాఠకిరీట మనోజ్ఞమాళి! వి
భ్రాజిత ధర్మపోషక! పరాక్రమపాలిత దిగ్విభాగ! వి
రాజవిశుద్ధ తేజ! జిజియాజననీ హృదయాబ్ధిచంద్ర! నీ
రాజన మంగళా శిషవిరాజితమూర్తి! శివాజిపార్థివా!

: శివాజీ ప్రవేశము :

**వైతాళికులు**

శ్రీ శ్రీ శ్రీ పూజ్యశ్రీ భగవాన్ సమర్థరామదాసస్వామిమహారాజా!

**భారతీతీర్థులు**

స్వాగతము! సుశ్యాభివందనములతో పంపిన మాఆహ్వానము ల నందుకొని శ్రమప్రయాసలకోర్చి సమావేశమైన సదస్యుల కందరకు మాహృదయపూర్వకాభినందనములు! భారతభాగ్యోదయమైనది! మహారాష్ట్రరాజ్యమున స్వర్ణయుగారంభమైనది. నేడుభారత దేశమునకు పండుగ! శ్రీ శ్రీ శ్రీ మహారాజరాజశ్రీ శివాజీ మహారాజు పట్టాభిషేకమహోత్సవము!

ఈమహోత్సవమునకు విజయముచేసిన మిత్రరాజ్యములకు మా స్వాగతము! సామంతదండనాథులకు అభివందనములు. నేటికి రెండుమాసమునుండియు, మహోత్సవములలో విధివిరామము లేక పాల్గొనుచు మంగళాశిష ప్రశంసాస్వస్తి సామగానములు సల్పుసద్బ్రాహ్మణ వరేణ్యులకు మానమస్కారములు. స్వదేశవిదేశములరాయబారులకు మాకృతజ్ఞత!

శివాజీ

సదస్యులకు నమస్కారము.

భా. తీ.

శ్రీశ్రీశ్రీ పూజ్యశ్రీ వేదాంతమార్గ ప్రతిష్ఠాపనా చార్యులు కాశీవిద్యాలయాధ్యక్షగాగభట్ట మహాశయులకు స్వాగతము!

గాగభట్టు

సదస్యులారా! సకలమిత్రసామంతరాజ దండనాథ పౌరజనాభిమతముచే శ్రీ శ్రీ శ్రీ మహారాజశ్రీ శివాజీ ప్రభువర్యులకు పట్టాభిషేకమహోత్సవము జరుగుట యావత్ భారతదేశమునకు మహానందదాయకము- శ్రీశివాజీమహారాజు స్వతంత్రమరాఠదేశమున వీరధర్మము పునఃప్రతిష్ఠితముగావించిన నవ్యభారతనిర్మాత. ఈమహాపురుషునిజీవితచరిత్ర ఉజ్వలస్తోత్రతేజముయొక్క దివ్యసంకీర్తనము! సనాతనధర్మశాస్త్రానుసారము సుక్షత్రియవంశచూడామణి. రాజ్యాభిషేకమునకు సర్వవిధముల ఉత్తమోత్తమాధికారి. రాజ్యాభిషేకమునకు నన్ను పురోహితునిగా వరించుట సనాతనధర్మమును శిరసావహించిగౌరవించుట. సదస్యుల ఆదరాభిమానాంగీకారములతో, నేనీధర్మాధికారాభిజ్ఞానములను పూజ్యశ్రీ శ్రీమాన్ భగవాన్ సమర్థరామదాసస్వామివారి ఆజ్ఞానుసరము మహారాజునకు సమర్పించుచున్నాను,

: కిరీటమును కరవాలమును సమర్పించును :

సత్యసంరక్షణార్థము- ధర్మసంస్థాపనార్థము ఈకిరీటమును కరవాలమును ధరించి- ఛత్రపతివై రాజ్యమేలుకొనుము!

జై ఛత్రపతి శివాజీకి జై!

శివాజీ

జై! భగవాన్ రామదాసస్వామికి జై!

: జయజయ ధ్వానములు!- నమస్కరించును :

గాగభట్టు

దీర్ఘాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిరస్తు! అంతఃపురసౌధాంతము నుండి పట్టాభిషేకమహోత్సవమును గాంచుచున్న రాజజనని జిజియామాత ధన్యచరిత!

శివాజీ

శ్రీమాన్ పూజ్యశ్రీ భగవాన్ శ్రీరామదాసస్వామి గురుదేవులకు శివానమస్కారములు-

రామదాసు

సమస్తమంగళావాప్తిరస్తు!

శ్రీమంతంబయి వేదధాత్రియయి ఆశీతాద్రి సేతుప్రజా
స్తోమాభ్యున్నతి విశ్వభారతి శరత్ జ్యోత్స్నాయశోవల్లికా
రామంబై విలసిల్లుగాక! విమలాన్వప్రోక్తవిజ్ఞాన తే
జోమార్గంబున వెల్గుగాక! సకలక్ష్మోణీశిరోరత్నమై.

—: భరతవాక్యము :—

ఛత్రపతి శివాజీ.



## : ఈ గ్రంథకర్తవి :

౧ ధర్మచక్రం :

చారిత్రక రూపకము. బిందుసారుడు చంద్రగుప్త
చాణుక్యమంత్రి ఉషాదేవి ప్రధానపాత్రలు.

౨ శ్రీకృష్ణదేవరాయలు :

విద్యానగర సామ్రాజ్యమునాటి చారిత్రక నవల

౩ దక్షిణభారతచరిత్ర :

దక్షిణభారత ద్వీపకల్ప చరిత్ర.

౪ కావ్యగుచ్ఛము :

ఖండకావ్య సంపుటి.

౫ నవరస ప్రపంచము :

సారస్వత మీమాంస.

౬ యశోధర :

పద్యప్రబంధము.

౭ కథాప్రపంచము :

కథానికా సముచ్చయము.

౮ వ్యాసమంజరి :

సారస్వతవ్యాసములు.

౯ తిక్కన :

కవిబ్రహ్మ జీవితవృత్తము.

## : అచ్చులోనున్నవి :